

అర్కాది గైదార్

# చుక్, గెక్: అన్నదమ్ములు

అర్కాది గైదార్

# చుక్, గెక్: అన్నదమ్ములు





"ప్రగతి" ప్రచురణాలయం
మాస్కో



శ్యామల పర్వతాల అరణ్యంలో ఒకతను ఉంటూండేవాడు. అతడు ఎంతో కష్టపడి పనిచేసే వాడు. ఎంత కష్టపడి పనిచేసినా ఇంకా పని ఉంటూనే ఉండేది. సెలవల్లో ఇంటికి వెళ్లేందుకైనా అతనికి తీరిక వుండేదికాదు పాపం.

ఇలా వుండగా, ఒకసారి చలికాలం వచ్చేసరికి, అతను ఒంటరి జీవితాన్ని ఇక భరించలేక, సెల వల్లో తన దగ్గరకు వచ్చి కొన్నాళ్లు వుండడానికని పిల్లలను తీసుకొని రావలసిందని తన భార్యపేర వుత్తరం రాశాడు.

అతనికి ఇద్దరు కొడుకులు: పెద్దవాడి పేరు చుక్, చిన్నవాడి పేరు గెక్.

ఆ అరణ్యానికి ఎంతో దూరంలో, కొన్ని వేల కిలోమీటర్ల దూరంలోవున్న ఒక మహాపట్నంలో పిల్లలనిద్దరినీ పెట్టుకుని తల్లి జీవించుతూండేది. ఈ పట్నాన్ని మించి సుందరమైన పట్నం ఇక ఈ భూప్రపంచంలోనే లేదు.

ఈ పట్నపు బురుజుల శిఖరాలనుండి అరుణ తారలు రాత్రింబగళ్లు తళుకులు ప్రకాశించుతూ వుంటాయి.

ఇక వేరే చెప్పాలా? ఆ పట్నంపేరు మాస్కో.

* * *

ఆ వుత్తరం పట్టుకుని పోస్టుజవాను మేడమెట్లు ఎక్కుతూండే క్షణంలో చుక్ గెక్కులు ఇద్దరూ మల్లయుద్ధం పేచీలో ఒకరితో ఒకరు పెనవేసుకు పోయున్నారు. ఇక ఆ యుద్ధం — ఇంతా అంతా యుద్ధమా అది — అబ్బో, మహా దివ్యమైన యుద్ధం!

ఆ యుద్ధానికి కారణమేమిటో మరి నాకిప్పుడు జ్ఞాపకంలేదు. గెక్ దగ్గరవున్న కాళీ అగ్గిపెట్టెను చుక్ లాక్కొనేనా వుండాలి — లేకుంటే, చుక్ దాచుకున్న జోళ్లరంగు డబ్బాని గెక్ కాజేసేనా వుండాలి.

అన్నదమ్ములిద్దరూ ఒకరినొకరు చెరొక దెబ్బ వేసుకున్నారు, మరొక దెబ్బ వేసుకోడానికి సిద్ధమవుతూండగా, ఇంతట్లో ఇంటి తలుపు గంట చప్పుడయింది. వాళ్లిద్దరూ భయపడిపోయి ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. ఆ వచ్చినది అమ్మే కాబోలు ననుకున్నారు. అందరి తల్లులాంటిదీ కాదు ఆమె. పోట్లాడుకున్నారని చెప్పి ఆమె వాళ్లను ఎన్నడూ కోప్పడేదీ కాదు, రాద్ధాంతసిద్ధాంతమూ చేసేదీకాదు. ఏమీ అనకుండానే ఆకతాయిలనిద్దరినీ చెరొక గదిలోనూ పెట్టేసి, తలుపు గొళ్లెంపెట్టేసి, అలా ఒక గంటసేపు, ఆ మాటకొస్తే ఒక్కొక్కప్పుడు రెండు గంటలసేపు కూడానూ, ఇద్దరినీ కలిసి ఆడుకోనివ్వకుండా, అలా వుంచేసేది, అంతే.

ఒక గంటసేపు — టిక్, టాక్, టిక్, టాక్ అంటూ ఒకటా రెండా, అరవై నిముషాలు కొడితేనే గాని గంట పూర్తి కాదాయె. ఇంక రెండు గంటలంటేనా — బాబోయ్, ఇంకా హెచ్చన్నమాటే!

అందుకని, ఆ వచ్చినది అమ్మే కాబోలు ననుకొని, కళ్లవెంట కారుతూన్న నీళ్లు చప్పున తుడిచేసుకుని, తలుపు తీయడానికని ఇద్దరూ పరుగెత్తారు.

తీరా తలుపు తెరచే సరికి అమ్మ కానేకాదు, ఆ వచ్చినది వుత్తరం పట్టుకొచ్చిన పోస్టుజవాను.

"నాన్న దగ్గరనుంచి వుత్తరం" అంటూ ఒక్క అరుపు అరిచారిద్దరూ. "హుర్రా! నాన్న దగ్గరనుంచి! నాన్నిక వచ్చేస్తూండాలి!"

ఇక సంతోషం పట్టలేక పిల్లిమొగ్గలేశారు, చెంగు చెంగున గంతులేశారు, సోఫా మీదనుండి అంతర్లు కొట్టారు. ఎందుచేతంటే, ప్రపంచంలో వున్న మహాపట్నాలన్నిటిలోనూ మాస్కో పట్నమే



అత్యంత అద్భుతమైనదే అయినప్పటికీ, పూర్తిగా ఒక ఏడాదిపాటు నాన్న లేకపోయేటప్పటికల్లా అంత మాస్కో మహాపట్నం సహితమూ ఏమిటో వెలవెలబోయి, వాళ్లకి విసుగెత్తిపోయింది.

ఆనందోత్సాహంలో వారెంతగా మునిగి తేల్తున్నారంటే తల్లి ఇంట్లోకి వచ్చినదన్న సంగతైనా వారు గమనించలేదు.

ఆమె లోపలికి వచ్చేసరికల్లా తన ముద్దుల కొడుకులిద్దరూ సోఫామీద వెల్లకిలా పడుకుని గోలచేస్తూ, కాలి మడమలతో గోడమీద తధికిణ తోమ్ — తధికిణ తోమ్ అని లయ కొడుతూండడమూ, అదైనా ఎంత జోరుగా కొడుతున్నారంటే ఆ దరువు జోరుకి సోఫాకి ఎగువగా గోడకు పటంకట్టిన బొమ్మలు గిజగిజమని అదరిపోతూండడమూ, గడియారంలో స్ప్రింగులు ఝూంకారం చేస్తూండడమూ చూసి, చెప్ప నలవికానంత ఆశ్చర్యం వేసిందామెకు.

కాని పిల్లల ఆనందానికి కారణమేమిటో ఆమె తెలుసుకున్న తరువాత ఆమె వారినీ ఏమీ అన లేదు, ఏమీ చెయ్యలేదు.

అంతే కాదు, అందుకు బదులు, ఆమె తటాలున వాళ్లని సోఫాలోనుండి దొర్లించేసి, తన ఫర్ కోటును విప్పేసి, తన తలమీదనున్న మంచు చెక్కులను దులుపుకోనైనా దులుపుకోకుండా, చప్పున ఆ వుత్తరాన్ని లంఘించుకుంది. ఆ మంచు చెక్కులు అప్పటికప్పుడే కరిగిపోయి, ఆమె నల్లని కను బొమలమీద ముత్యాల్లాగు మెరుస్తున్నాయి.

కొన్ని వుత్తరాలు సర్దాగా వుంటాయి, కొన్ని విచారంగా వుంటాయి. ఇది అందరకూ తెలిసిన విషయమే. అందుచేతనే, ఆ వుత్తరాన్ని తల్లి పఠించుతూంటే, ఆమె ముఖాన్ని పఠించుతున్నారు తదేకదీక్షతో చుక్ గెక్కులిద్దరూనూ.

ఉత్తరం చదువుకుంటూ తొలుత ఆమె ముఖం చిట్లించుకుంది. అది చూసి వీళ్లా ముఖాలు చిట్లించుకున్నారు. తరువాత ఆమె నవ్వుకుంది. ఆ వుత్తరం సర్దా అయిన వుత్తరమే కదా అని వాళ్లి ద్దరికీ అర్థమైంది.

''మీనాన్న రావడంలేదు'' అంది ఆమె వుత్తరం ఒకపక్క పడేసి. ''అతనికి బోలెడన్ని పనులు న్నాయట, సెలవల్లో ఇంటికి వచ్చేందుకు అతనికి వీల్లేదట''.

దిగ్భ్రాంతితో చుక్కూ గెక్కూ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. అరెరే, ఎంత విచారంగా వుండాలో అంత విచారంగానూ వుందే ఆ వుత్తరం!

మరుక్షణంలో వాళ్లిద్దరూ మూతి ఇట్టే పెట్టేసి, సణుగుతూ వాళ్లమ్మకేసి కోరచూపులు చూడడం మొదలెట్టారు, కాని ఆమె మాత్రం మరెందుచేతనో చిరునవ్వు నవ్వుతూంది.

''మీనాన్న రావడంలేదు'' అంది, ''కాని మనల్నే తన దగ్గరకు రమ్మని రాశాడు'' అని వాక్యం పూర్తిచేసింది.

ఆ మాట చెవిని పడగానే చుక్కూ గెక్కూ సోఫామీదనుండి ఒక్క పల్టీకొట్టారు.

''చాలా తమాషా మనిషిరా, మీనాన్న!'' అంటూ తల్లి నిట్టూర్చింది. ''నాదగ్గరకే రండి మీరు, అని రాశాడే — ట్రాంబండెక్కి వచ్చేయడం అనుకున్నాడు కాబోలు'' అంది.

''అవునమ్మా! 'రండి' అని నాన్న అంటే, ఇంకేముంది, బయల్దేరిపోవడమే'' అన్నాడు చుక్ తణుకూ బెణుకూ లేకుండా.

''ఓరి, సత్యకాలపు నాగమ్మా!'' అంది తల్లి, ''మీనాన్న దగ్గరకెళ్లడమంటే మాటలా? రైల్లో వెయ్యి కిలోమీటర్లు ప్రయాణం చెయ్యాలి. అదయాక మరో వెయ్యి కిలోమీటర్లు ప్రయాణం చెయ్యాలి. అదీ అయాక, స్లెయ్ ఎక్కి తైగాలో ప్రయాణం చెయ్యాలి. ఇక ఆ తైగాలో మనకి దారిలో ఏ తోడేలే ఎదురవునో, ఏ ఎలుగ్గొడ్డే ఎదురవునో! ఆరె బాబోయ్! మనం వెళ్లడమే, తల్చుకుంటేనే వొళ్లు జలదరించి పోతూంటే! మీకూ భయంవేస్తూంది కదూ!''

చుక్కూ గెక్కూ ఒక్క క్షణమాత్రమైనా వెనకతీయలేదు. వెయ్యి కిలోమీటర్లు కాదుకదా, లక్ష కిలోమీటర్లైనా సరే ప్రయాణం చేయడానికి తాము సిద్ధమే అన్నారు. తోడేలు కాదు, ఎలుగ్గొడ్డు కాదు, మరేదొచ్చినా సరే తమకేమీ భయంలేదన్నారు. తమకు కావలసినంత ధైర్యం వుంది. ఏమీ? భయంకరంగా వున్న కొత్త కుక్క ఒకటి నిన్న గుమ్మంలో కొచ్చేసరికి, రాళ్లు విసిరి తాము దానిని తోలేయలేదూ?



హాఠాత్తుని వాళ్లు కబుర్లు చెబుతూ చేతులు వూపుతూ, టక్కు టక్కుమని కదం తొక్కుతూ గది చుట్టూ గంతులేసుకుంటూ తిరగడం మొదలెట్టారు. వాళ్లు చెబుతూన్న కబుర్లన్నీ నెమ్మదిగా ఆలా వింటూ కూచుంది తల్లి. ఆలా కూచున్నదల్లా తటాలున గట్టిగా ఒక నవ్వు నవ్వి, వాళ్లిద్దరినీ తన చేతుల్లోకి తీసుకుని గిర్రున రెండు గిరికీలు తిరిగి, చివరికి వాళ్లని సోఫామీద కూలేసింది.

మనలో మనమాట: అసలు ఇలాంటి వుత్తరం వస్తుందని ఆమె ఎన్నాళ్లనుండో అనుకుంటూనే వుంది. ఉత్తరం వచ్చాక చుక్కునీ గెక్కునీ కాస్సేపు ఏడిపించుదామని ఆమె ఆలా ఒక చిన్న నాటక మాడింది — వాళ్లంటే ఆమెకంత ప్రేమ మరి!

* * *

ప్రయాణానికి వాళ్లని సిద్ధంచేసే సరికి తల్లికి వారం రోజులు పట్టింది. ఈ వారం రోజుల్లోనూ చుక్ గెక్కులిద్దరూ గోళ్లు గిల్లుకుంటూ కూచున్నారనుకునేరు సుమండీ!

వంటింట్లో వున్న కత్తితో తనకోసం ఒక బాకు తయారు చేసుకున్నాడు చుక్. సున్నగావున్న బెత్తా న్నొకదానిని ఎక్కడనుండో సంపాదించి, దాని చివరను మేకు ఒకటి దిగ్గొట్టాడు గెక్. ఎంకేముంది —

మంచి బలమైన బల్లెం ఒకటి తయారైంది. ఆ బల్లెం పుచ్చుకుని ఎలుగ్గొడ్డు గుండెల్లో ఒక్క పోటు పొడిచాడంటే, దారని అక్కడికక్కడికే గొడ్డు చచ్చి పడిపోవాలన్నమాటే — అయితే మరేంల్లేదు, అంతకు ముందు మాత్రం మరెవరేనా దానిని చంపేసి వుండాలి సుమండీ, అంతే!

చివరకి ఎలాగైతేనేం, ప్రయాణ సన్నాహాలన్నీ పూర్తి అయిపోయాయి. సామానంతా ప్యాకు చేయడ మైపోయింది. ఇంటికి ఒక తాళం కాదు — రెండు తాళాలు పెట్టించారు. రొట్టె పిసళ్ళూ, గోధుమపిండీ, బియ్యపు గింజలూ అల్మారాలో ఏ మాత్రం వుండిపోయినా వాటికోసం చుంచులు వస్తాయని చెప్పి, అల్మారాలో ఆ వాసనైనా లేకుండా శుభ్రం చేసేశారు. ఈ పనులన్నీ అయాక, అప్పుడు మర్నాడు బయలుదేరే రైలుకి టిక్కెట్ల కోసమని తల్లి రైలుస్టేషనుకు వెళ్ళింది.

తల్లి ఇంట్లోలేనప్పుడు చుక్కూ గెక్కూ పోట్లాట పెట్టుకున్నారు.

పాపం! ఆ పోట్లాట మూలంగా మీదటికి ఎన్ని కష్టాలు కలుగనున్నదీ వాళ్ళకి ముందుగానే తెలిసివుంటే ఆ రోజున నిజంగా వాళ్ళిద్దరూ ఎంతైనా బుద్ధిగా వుండేవారే.

* * *

చుక్ పొదుపరి. అందుచేత తాను జాగ్రత్త చేసిన టీపొట్లాల తగరపు రేకులనూ తాను కూడబెట్టుకున్న చాకలేట్లుకు చుట్టిన టాంకుల, విమానాల బొమ్మల కాగితాలనూ తన దగ్గరవున్న టిన్ను పెట్టెలో భద్రంగా దాచిపెట్టుకునేవాడు. ఇంకా — బాణాలు చేయడానికని కోవెల పక్షి ఈకలూ, గారడీ గమ్మత్తులు చేసేందుకు గుర్రపుతోక వెంట్రుక, ఇలాటివే ముఖ్యమైన ఇతర వస్తువులూ ఆ పెట్టెలో వుంటూండేవి.

గెక్కుకి ఇలాంటిపెట్టె లేదు. అసలు గెక్ అంత జాగ్రత్త అయిన వాడుకాదు. పరధ్యాన్నం ఎక్కువ. అయితేనేం, పాటలు పాడడంలో మొదట గెక్ పేరుచెప్పి తరువాత మరెవరి పేరైనా చెప్పాలి — అంత బాగా పాడతాడన్నమాట.

ఒక మూల కూచుని చుక్ తన పెట్టెలోవున్న అమూల్యమైన వస్తువులను సర్దుకుంటున్నాడు. రెండో గదిలో హాయిగా పాటలు పాడుకుంటున్నాడు గెక్. ఇలా ఎవరి పనుల్లోవారు మునిగి వుండగా, పోష్టుజవాను వచ్చి మీ అమ్మగారికి టెలిగ్రాం వచ్చిందంటూ ఒక టెలిగ్రామును చుక్కుకి అందిచ్చి వెళ్ళిపోయాడు.

ఆ టెలిగ్రామును చుక్ అందుకుని, తన టిన్ను పెట్టెలో అట్టేపెట్టి, ఆ క్షణం వరకూ పాట పాడుతూన్న గెక్ ఎందుకు పాట ఆపుచేశాడు చెప్మా అని అనుకున్నాడు.

"హుర్రా! హుర్రా! హుర్రా!

"నీపని పట్టించానురా!"

అంటూ ఇంటిమీదనుండి పెంకులు ఎగిరిపోయేటట్టు అరుస్తున్నాడు గెక్.

ఇదేమిటి ఇలా పిచ్చికేకలు పెడుతున్నాడు చూదామని గదితలుపు తీసి చూశాడు చుక్. చూసే సరికల్లా ఆ "పని పట్టించడం" అంతా చూసి చుక్కుకి వొళ్లు మండిపోయి, చేతులు వణకడం మొదలెట్టాయి.

గది నడిమధ్య కుర్చీ వుంది. కుర్చీ వీపున దినపత్రిక వేలాడుతూంది. బల్లెపు పోట్లతో పత్రి కంతా కన్నాలూ చిరుగూ పడి చీకిపోయుంది. అక్కడకది చాలనట్టు, అమ్మ జోళ్ల ప్యాకు చేసుకునే పసుప్పచ్చ అట్ట పెట్టెకు గెక్ ఎలుగ్గొడ్డని నామకరణం చేసి, దుర్మార్గుడు గెక్ దాన్ని తన బల్లెంతో అదే పనిగా కేకలేసుకుంటూ కొంప మునిగిపోయినట్టు పోట్లు పొడిచేస్తున్నాడు. మరేమో — ఆ పెట్టె లోనే చుక్ ఒక బాకా, నవంబరు విప్లవ దినం రంగుల బాడ్జీలు ముడూ, ఈ దూర ప్రయాణానికని తాను దుబారా ఖర్చులు మానుకుని జాగ్రత్తగా కూడబెట్టుకున్న మొత్తం నలభైయ్యారు కోపెక్కుల డబ్బూ ఆ అట్టపెట్టెలోనే దాచుకున్నాడాయె.

బల్లెపు పోట్లకు తుక్కుతుక్కుకింద తూట్లు పడిపోయిన ఆ అట్టపెట్టె తన కళ్లపడేసరికల్లా చుక్, గెక్కు చేతిలోవున్న బల్లేన్ని చటుక్కున లంకించుకుని, తన మోకాలిమీద టుపుక్కుమని రెండు ముక్కలుకింద విరిచేసి ఆ రెండు ముక్కలనూ నేలమీద విసిరేశాడు.

ఇంకేముంది, ఉత్తరక్షణంలో గెక్ చెంగున డేగలాగున చుక్కు మీదకెగిరి, చుక్కు చేతిలోవున్న టిన్ను పెట్టెను తటాలున లాగేసి, కిటికీ గడప మీదకెక్కి, కిటికీలోంచి ఆ పెట్టెను వీధిలోకి గిరవాటేశాడు.

ఈ దౌర్జన్యం చూసి చుక్కుకి తల్ప్రాణం తోకకొచ్చింది. చెవులు చిల్లుపడేటట్టు ఖ్యాంయ్‌మని "టెలిగ్రాం రా! టెలిగ్రాం రా!" అని కేకపెడుతూ నెత్తిని టోపీనైనా పెట్టుకోకుండా ఇంట్లోంచి వీధిలోకి ఒకటే పరుగు పరిగెత్తాడు.

ఏదో కొంప మూడింది అని గెక్ ఊహించుకుని, తాను కూడా చుక్ వెంట పడ్డాడు.

ఆ టిన్నుపెట్టెకోసమూ, ఇంకా విప్పకుండానే అందులోవున్న ఆ టెలిగ్రాం కోసమూ అన్నదమ్ములిద్దరూ ఆ చుట్టుపక్కలంతా గాలించారు. ఏమీ లాభం లేకపోయింది. గాలికి కుప్పలు తిప్ప లుగా పోగుపడుతూన్న ఏ మంచు గుట్ట అడుగునో అది పడిపోయేనా వుండాలి, లేదా రోడ్డు పక్కనున్న చపటాల మీద పడితే దారంట పోయేవారెవరైనా దానిని తీసైనా వుండాలి. ఏమైతేనేమి సిక్కు వేసివున్న ఆ టెలిగ్రాము, ఆ టెలిగ్రాముతో సహా ఇతర నిధినిక్షేపాలూ వున్న ఆపెట్టె ఎక్కడా ఐపూ జాడా లేకుండా శాశ్వతంగా మాయమైపోయాయి.

* * *

చుక్కూ గెక్కూ ఇంటికొచ్చేసి, మాటా మంతీ లేకుండా చాలా సేపు అలా కూచున్నారు. తమ పోట్లాట గురించి వాళ్లు ఇందాకానే రాజీ పడిపోయారు. కాని జరిగిన అసలు విషయం గురించి అమ్మతో ఎలా చెప్పడమో వాళ్లకేమీ పాలుపోకుండా వుంది. అమ్మకి తెలుస్తే ముఖం వాచిపోయేటట్టు చీవాట్లు

ఇద్దరికీ తప్పువు కదా. గెక్ కంటె చుక్ ఏడాది పెద్ద, అందుచేత తనకే పెద్ద శిక్ష పడుతుందని చుక్ భయం. ఆ కారణాన చుక్ మరీ గట్టిగా ఆలోచించుతూ కూచున్నాడు.

''ఒక సంగతిరా, ఒరే గెక్కూ! మనం అమ్మతో అసలు టెలిగ్రాం వూసే చెప్పకపోతేనో? ఇంతకీ — టెలిగ్రామే కదా, అది పోవడమూ ఒక గమ్మత్తే!'' అన్నాడు చుక్.

''ఛీ! మనం అబద్ధం ఆడకూడదు రా. అబద్ధాలాడామంటే అమ్మకి మరింత కోపం వస్తుంది'' అంటూ గెక్ నిట్టూర్చాడు.

''అబ్బే, మనం అబద్ధం ఆడమే '' అన్నాడు వెంటనే చుక్ నవ్వుతూనూ. '' 'టెలిగ్రాం ఏదిరా?' అని అమ్మ గనుక మనను అడిగితే, అప్పుడు మనం తప్పకుండా చెప్పేద్దాం. కాని అడగదే అనుకో, అప్పుడు మనమై ఎందుకు తగుదునమ్మా అంటూ ఆ చాటభారతమంతా మొదలుపెట్టడం? పిలవని పేరంటం మనకెందుకు?''





''అవును రా'' అని గెక్ ఒప్పుకున్నాడు. ''అబద్ధం ఆడడం అవసరం లేకపోతే నువ్వు చెప్పినదే బాగుంది. భేష్, అలాగే(న్రా, చుక్!''

ఆ విషయం గురించి వాళ్లిద్దరూ ఒక ఒప్పందానికి వచ్చారో ఇంకా రానేలేదో, తల్లి ఇంటికి వచ్చింది. రైలుకు టిక్కెట్లు దొరికాయనీ, అందులోనూ మంచి సదుపాయమైన బెర్తులే దొరికాయనీ ఆమె ముఖం కొండదుకున్నట్టుంది. అంత సంతోషంలోనూ కూడా తన ముద్దుల తనయు లిద్దరూ ముఖాలు సాగతీసికుని వుండడమూ, కళ్లు చెమ్మగిలి వుండడమూ ఆమె వెంటనే కనిపెట్టేసింది.

''పౌరులారా! నేను లేనప్పుడు జరిగిన మీ పోట్లాటకు కారణమేమిటో ఇక చెప్పి ఒప్పేసుకోండి'' అంది ఆమె తన కోటునుండి మంచు దులిపేస్తూ.

''పోట్లాడుకోందే'' అన్నాడు చుక్.

''అబ్బే, లేదు'' అని వంతపాడాడు గెక్. ''పోట్లాడుకుందామని అనుకున్నాం, కాని పోట్లాడు కోవడం మంచిదికాదని మళ్లీ ఆలోచించుకుని — మళ్లీ వెంటనే మానేశాం.''

''అలాంటి ఆలోచనలు మీకుంటే నాకెంతేనా ఇష్టం'' అంది వాళ్లమ్మ, కోటు విప్పేసుకుని, సోఫాలో చతికిలబడి, ఆకుపచ్చని అట్ట టిక్కెట్లు మూడింటిని — ఒకటి పెద్దదీ, రెండు చిన్నవీ — చూపించింది.

మరికాస్సేపటికల్లా రాత్రి భోజనం చేసేసుకున్నారు. వీధిలో సద్దు మణిగింది. ఇంట్లో దీపాలు ఆర్పేసుకుని వాళ్లు ముగ్గురు హాయిగా నిద్రపోయారు.

సెలిగ్రాం గురించి తల్లికేమీ తెలియదు, మరి అందుచేత సెలిగ్రాం గురించి ఆమె కొడుకులను అడగనే లేదు.

* * *

ఆ మరునాడు వాళ్లు బయల్దేరారు. అది రాత్రి పూట రైలు అవడంచేత, రైలు బాగా పొద్దుపోయే బయల్దేరింది. అందుకని కిటికీలకి నల్లని అద్దాలు వేసేసి వున్నాయి. ఆ నల్లని అద్దాల్లోనుండి బయటనున్న దృశ్యాలేవీ చుక్కకీ గెక్కకీ అవుపడనేలేదు.

రాత్రి నిద్రపోతూన్న వాడల్లా గెక్కకి నిద్రలో దాహంవేసి మెలకువ వచ్చింది. కంపార్టుమెంటు సరంబీకున్న చిన్నదీపం ఆర్పేసి వుంది. అయినప్పటికీ గెక్కచుట్టూ వున్నవన్నీ — బల్లమీద తెల్లని టేబిలుగుడ్డపై నృత్యం చేస్తూన్న గాజుగళాసూ, ఇప్పుడు ఆకుపచ్చగా కనబడుతూన్న పసుప్పచ్చని నారింజపండూ, గాఢనిద్రలో వున్న అమ్మ ముఖమూ — అన్నీ నీలిరంగు వెల్తురులో మునిగి తేల్తున్నట్టున్నాయి. అవతలివైపు మంచు పూత పూసివున్న కిటికీ అద్దంలోనుంచి చంద్రుడు అవుపించాడు గెక్కకి — మాస్కోలోవున్న చంద్రుడులాగున కాకుండా, ఈ చంద్రుడు బ్రహ్మాండంగా వున్నాడు. మహాపర్వత పంక్తుల్లోనుండి రైంయ్ రైంయ్‌మని రైలు దూసుకుపోతూండాలి, భూమిమీదకంటె మహాపర్వత శిఖరాలనుండి చంద్రుడికి బాగా దగ్గర కదామరి, అందుచేతే చంద్రుడు అంత బ్రహ్మాండంగా అవుపడుతున్నాడు, అని నిశ్చయించేసుకున్నాడు గెక్.

అమ్మని లేపి మంచినీళ్లు అడిగాడు. రాత్రిళ్లు మంచినీళ్లు తాగకూడదని తెలియదా ఏమిటి, అంత దాహం వేస్తూంటే నారింజపండు వొల్చుకుని ఒక తొన తిను అనేసింది అమ్మ.

గెక్ మూతి ముడిచేసుకున్నాడు, కాని నారింజపండు వొల్చుకుని నాలుగు తొనలు తినడమేమో తిన్నాడు. ఇదంతా అయాక గెక్కకి ఇక నిద్రపో బుద్ధి కాలేదు. నిద్రపోతూన్న చుక్కని లేపడానికని వాడిని ఒక కుదుపు కుదిపాడు. చుక్క కోపంతో బుస్సు మన్నాడేకాని, కళ్లు విప్పకుండా అలాగే నిద్రపోయాడు.

దాంతో, గెక్ తన ఫెల్ట్ బూడ్సు తొడుక్కుని, తలుపు తీసుకుని, కంపార్టుమెంటు వసారాలోకి వెళ్లాడు.

వసారా ఇరుకుగా సందులా పొడుగ్గా వుంది. వసారా గోడకి పొడుగునా చిన్న స్ప్రింగు బెంచీలు బిగించి వున్నాయి. వాటిమీద కూచుని లేచేసరికల్లా టప్‌మని శబ్దం చేసుకుంటూ మడతబడిపోయేమి.



వసారాలోకి మరో పది కంపార్టుమెంట్ల తలుపులున్నాయి. ఎర్రగా నిగనిగలాడుతూన్న తలుపులకి తళుకు తళుకుమని మెరుస్తూన్న ఇత్తడి గుబ్బలున్నాయి.

గెక్ మొదట ఒక స్ప్రింగు బెంచీమీద కూచున్నాడు. దానిమీద నుంచి లేచి, దాని పక్కనున్న బెంచీమీద కూచున్నాడు. తరువాత మరోదానిమీద. ఆలా వసారా పొడుగునా అన్నిటిమీదనూ కూచుని లేస్తూ, ఆఖరున వసారా చివరకి చేరుకున్నాడు. సరిగా ఆ సమయానికే లాంతరు పట్టుకుని కండక్టరు చక్కావచ్చి, అందరూ నిద్రపోతూండగా టప్ టప్‌మని ఏమిటీ చప్పుడు చేయడమంటూ గెక్కుని కోప్పడ్డాడు.

కండక్టరు వెళ్లిపోగానే గెక్ గబగబా తన కంపార్టుమెంటుకి వెళ్లిపోయాడు. కంపార్టుమెంటు తలుపు తెరవబోగా అది ఒకంతట వచ్చిందికాదు. కాని ఎలాగైతేనేమి కష్టంమీద తెరవగల్గాడు. అప్పుడు కంపార్టుమెంటులోకి వెళ్లి, తల్లికి నిద్రాభంగం కలుగకుండా వుండేందుకని అతి జాగ్రత్తగా తలుపు మూసేసి, మెత్తగావున్న తన పరుపులోకి దూకాడు.

చేతులూ కాళ్లూ పారచాపేసుకుని పక్క అంతా ఆక్రమించేసుకుని చుక్ బోర్లా పడుకునుండడం చూసి, కాస్త జరగమని వాడి డొక్కలో పొడిచాడు గెక్.

ఆరె బాబోయ్! ఇదేమిటి? చింపిరిజుట్టు బుర్రా, బూరె బుగ్గలూ వున్న చుక్ ముఖం బదులు, గరిమీసాలున్న కొత్త ముఖం ఒకటి గెక్కుకు ఎదురై చిరచిరలాడుతూ గర్జించింది:

"ఎవర్రా నన్ను గుంజుతున్నాడు?"

దాంతో మొర్రో అని ఒక్క అరుపు అరిచాడు గెక్. ఆ అరుపుతో కంపార్టుమెంటులో పడుకున్న వాళ్లందరూ లేచిపోయారు. దీపం వెయ్యండంటే దీపం వెయ్యండన్నారు. దీపం వెయ్య గానే, ఇకనేముంది — తాను ప్రవేశించినది తన కంపార్టుమెంటు కాదనీ, ఇంకొక కంపార్టుమెంటనీ గెక్కుకి తెలిసిపోయింది. దాంతో వెనకటికంటెనూ గట్టిగా మొర్రోమని రాగాలు పెట్టాడు గెక్.

జరిగిన సంగతేమిటో కంపార్టుమెంటులో వున్నవారి కందరకీ బోధపడిపోయి, అందరూ నవ్వు కున్నారు. గరిమీసాల మనిషి లేచి, పంట్లాం తొడుక్కుని, తన ఆర్మీషర్టు వేసుకుని, గెక్కుని తీసుకెళ్లి వాడి కంపార్టుమెంటులో విడిచిపెట్టాడు.

గెక్ తన పక్కలోకి దూరిపోయి, బూర్నీసు కప్పేసుకుని పడుకున్నాడు. అప్పటికిగాని ఏడుపు కట్టిందికాదు. రైలు వుయ్యాల వూగుతూంది, గాలి ఝూంకారం చేస్తూంది.

కొత్తగా కనబడుతూన్న ఆ బ్రహ్మాండమైన చందమామ, నృత్యం చేస్తూన్న ఆ గాజుగళాసునీ, తెల్లని టేబిలుగుడ్డపైనున్న పచ్చని నారింజపండునీ, నిద్రలో చిరునవ్వు నవ్వుతూన్న తల్లి ముఖాన్నీ, తన నీలి కాంతులతో ప్రక్షాళనం చేస్తున్నాడు.

చిట్టచివరకు గెక్కుకు కూడా నిద్ర పట్టిపోయింది.

ఇంతింతయన నలవికాని
వింత కల కనెనా బుడుతడు:
నిండు ప్రాణముతో రైలుబండి
గుండ్రని చక్రాల్ నిండు కంఠాన
ఒండొంటితో పల్కుచుండె.
అంచెలు కట్టుకు పర్వులనిడు పెట్టెలు
ఘోషించె ఘనముగ ఇంజనుతో.

తొలిపెట్టె: పదండి కామ్రేడ్స్! పదండి ముందుకు
చీకటి చీల్చుకు సాగిపోదాం ముందుకు.

మలిపెట్టె: ఓ ఇంజను జ్యోతీ! ఉజ్వలకాంతీ!
వేగుజుక్కను మించు వెల్గురాసీ!
ఉదయతారను నిరసించు దీప్తీ!

మూడో పెట్టె: అగ్నిజ్వాలా, అందుకొను నాకశమును!
ఓ, ఇంజనూ, పూరించు నీ శంఖము!
ఓ, చక్రములారా, పర్వెత్తుదు ప్రాగ్దిశను!
నాల్గో పెట్టె: విరమింతుము మన మీ సంభాషణ
గమ్యము చేరిన క్షణమున
శ్యామల పర్వత శిఖరాగ్రమున.

* * *

గెక్కుకి మెలకువ వచ్చేటప్పటికి పెట్టెలు ఇక సంభాషణ మానేసి, చురుకుగా లయవేసుకుంటూ పరిగెడుతున్నాయి. మంచుతో పలుచగా మలామా చేసిన కిటికీలోంచి సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. బెర్తులన్నీ సర్దేసి వున్నాయి. ముఖం కడుక్కుని తల దువ్వుకుని యాపిల్ ఒకటి కొరుక్కు తింటున్నాడు చుక్. గరిమీసాల సైనికుడు అమ్మతో కూడా కంపార్టుమెంటు గుమ్మంలో నిలబడి గడచిన రాత్రి గెక్ చేసిన సాహసకార్యాలు చెప్పగా ఇద్దరూ నవ్వుకుంటున్నారు. ఎర్రసైనికుడు తన కిచ్చిన పెన్సిలును చుక్ గెక్కుకు చూపించాడు. ఆ పెన్సిలుకు పచ్చని తుపాకి తోటామొన వుంది.

కాని గెక్కుది ఈర్ష్య స్వభావం కాదు, ఓర్వలేని తనం ఏ కోశానాలేదు. గెక్ వొట్టి బహుపరాకు మనిషి. రాత్రేమో ఏమరుపాటున మరొక కంపార్టుమెంటులోకి వెళ్ళిపోయాడు. ఇప్పుడేమో ఎడమ చేతితో తన పంట్లాం ఎక్కడో పెట్టేసుకున్నాడు, ఇప్పుడు అదెక్కడుందో గుర్తు లేదాయె. అయితే ఏం, గెక్ చక్కగా పాటలు పాడతాడు — భేషుగ్గా పాడగలడు గెక్.

గెక్ ముఖం కడుక్కుని, తల్లికి నమస్కారంచేసి, రైలు ఏయే పరిసరాల్లోంచి వెళ్ళుతూందో, ఆ పరిసరాల ప్రజలు ఎలా జీవిస్తున్నారో తెలుసుకుందామని తన ముఖాన్ని ఆ చల్లని కిటికీ అద్దానికి అప్పగించి నిలబడి చూస్తున్నాడు.

పోతే — ఇక చుక్కేమో, కంపార్టుమెంటులన్నీ చాంద్రాయణం చేసుకుంటూ, ప్రయాణీకు లందరితోనూ పరిచయం చేసుకుంటూ, అందరిచ్చిన బహుమతులనూ — ఉపయోగకరములైన రకరకాల చిన్నచిన్న వస్తువులను — సీసాలకు పెట్టే రబ్బరు బిరడా, మేకు ఒకటీ, ట్వైను దారం ముక్క ఒకటీ, ఇలాంటివి — పోగుచేసుకుంటూండగా, గెక్ తమాషా సంగతుల నెన్నింటినో కిటికీలోంచి కనిపెడుతున్నాడు.

అదుగో, అక్కడ ఆ అడవిలో చిన్న ఇల్లు కనబడుతూందిగా! ఆ యింటి ముందువసారాలోకి పెద్ద ఫెల్ట్ బూడ్సులు తొడుక్కుని, లాల్చీవేసుకుని చేతుల్లో ఒక పిల్లిని పెట్టుకుని దుడుంగుమని వచ్చాడు ఒక కుర్రాడు. తుప్పుమని పిల్లిని గిరవాటేశాడు ఆ అబ్బాయి. హుష్మని పిల్లి నేలమీద దూది



పరిచినట్టే పడివున్న మంచులోకి ఒక్క అంతరు కొట్టింది. మంచులోకి దిగబడి, మంచులోనుండి బండగా పైకి దేకుకొచ్చి, గంతు లేసుకుంటూ పారిపోయింది ఆ పిల్లి.

అయితే — పిల్లిని ఆలాగున ఆ పిల్లడు ఎందుకు విసిరేసినట్టు? బహుశ బల్లమీద ఏ మిఠాయి వుండో వుంటే, దానిని ఆ పిల్లి లంకించుకునుంటుంది.

సరి — ఆ ఇల్లూ, ఆ చిన్న కుర్రాడూ, ఆ పిల్లీ, అన్నీ వెళ్లిపోయాయి. వాటి బదులు ఒక పొలం మధ్య ఒక ఫ్యాక్టరీ వుంది. పొలం తెల్లగా వుంది. ఎర్రగా వున్నాయి ఫ్యాక్టరీ గొట్టాలు. వాటిలో నుండి వస్తూన్న పొగ నల్లగా వుంది, దీపాలేమో పచ్చగా వున్నాయి.

ఫ్యాక్టరీలో ఏమి వస్తువులు తయారు చేస్తున్నారో కదా? అరే, పహరా సిపాయి బడ్డీ ఒకటుందే! బడ్డీ దగ్గర గొర్రెబొచ్చు తోలుకోటు వేసుకుని పహరా సిపాయి కూడా వున్నాడు! ఆ గొర్రెబొచ్చు తోలు కోటులో అతగాడు బ్రహ్మరాక్షసిలా వున్నాడు. అతని చేతిలోవున్న తుపాకి సన్నగా చొప్పదంటులా కనబడుతూంది. అలా అనుకుని అతడి దగ్గరసంటూ వెళ్లబోయేవు సుమా, జాగ్రత్త!

ఇక తరువాత, నృత్యం చేస్తూన్న అరణ్యం వచ్చింది. ఎదటవున్న చెట్లు వానావానా చెల్లప్పలా గిర్రున తిరుగుతూండగా, దూరాన వున్న చెట్లు, మంచుముద్దలతో ప్రశాంతంగా ప్రవహించుతూన్న తెల్లని నది వాటిని తీసుకుపోతూందేమో అన్నట్టు, నెమ్మదిగా తిరుగుతున్నాయి.

ఇంతట్లోకి, తనకిచ్చిన గొప్పగొప్ప బహుమతుల నన్నిటినీ పోగుచేసుకుని చుక్ కంపార్టుమెంటు లోకి రాగా, చుక్కుని పిలిచాడు గెక్. ఇక ఇద్దరూ కలిసి కిటికీలోంచి చూస్తున్నారు.

వుఫ్ వుఫ్‌మని పొగవిడుస్తూ నూటికిపైగా ఇంజన్లు ఇటూ అటూ తిరుగుతూ, విశాలంగా వెల్లడిగా వున్నట్టి పెద్దపెద్ద స్టేషన్లలోంచీ, మాస్కోలో వాళ్ల వీధి మొగినున్న కిరాణా స్టాండు దుఖాణమంతే — నిజంగానే, అంతకు రవంతైనా పెద్దదికాని బుచ్చిబుచ్చి స్టేషన్లలోంచీ రైంయ్ రైంయ్‌మని రైలు ముందుకు సాగిపోతూంది.

ఖనిజాలతోనూ, రాక్షసబొగ్గుతోనూ, రైలుపెట్టెకి సగానికి సగంవున్న బ్రహ్మాండమైన కొయ్య దుంగలతో నిండుగా నిండిన రైళ్లు ఝుంయ్‌మని ఎదురుదిక్కుగా పరిగెడుతున్నాయి.

ఒకసారి వాళ్లకి ఒక రైలు ఎదురుపడింది. రైలుపెట్టె లన్నిటిలోనూ ఆవులూ ఆబోతు లునూ. ఆ రైలుఇంజను కీచుగా కూతపెడుతూ తమాషాగా బుచ్చిగా బొమ్మ ఇంజనులా వుంది. తటాలున ఆబోతుల్లో ఒకటి కణలుకణేలుమని ఒక పెద్ద రంకె వేసేసరికల్లా ఆ ఇంజను డ్రైవరు గబుక్కున వెనక్కితిరిగి చూశాడు; వెనకనుంచి పెద్ద ఇంజను ఒకటి వస్తూంది కాబోలునని అనుకునుంటాడు అతడు!

ఒకమాటు ఒక చిన్న ప్లాట్ఫారంమీద పెద్ద శక్తివంతమైన కవచశకటాలను తీసుకెళుతూన్న రైలు పక్కనే బుజాలూ బుజాలూ రాసుకుంటూ వాళ్లరైలు ఆగింది.

ఆ శకటాల బురుజుల్లోనుండి టార్పాలిన్‌గుడ్డలతో చుట్టేసిన ఫిరంగులు నాల్గుదిక్కులా భయంకరంగా పొడుచుకొస్తున్నాయి. వెచ్చదనం పుట్టాలని కాళ్లు నేలని కదంతొక్కుతూ, సంచీ గ్లౌవ్స్ తొడుకున్న చేతులతో చప్పట్లు చరుస్తూ, సర్దాగా నవ్వుతూ ఎర్రసైనికులు ఆ రైలు చుట్టూ నిలబడున్నారు.





కాని తోలుకోటు తొడుకున్న ఒకతను మాత్రం ఆ కవచశకటం రైలుకు సమీపంలో ప్రశాంతంగా ఏదో ఆలోచిస్తూ అలా నిలబడున్నాడు. అతనిని చూడగానే, అతడు తప్పకుండా ఆ దళం కమాండరే అయివుండాలనీ, సర్వసైన్యాధిపతి దగ్గరనుండి ఉత్తరువులకోసమని అతడు అలా నిరీక్షిస్తున్నాడనీ చుక్కూ గెక్కూ నిశ్చయించేశారు.

ఇంకా ఇలాంటివే ఎన్నో విశేషాలను వాళ్లు దారిలో చూశారు. బయట మంచు తుపాను జోరుగా వీస్తూంది. ఆ తుపానుకి కిటికీ అద్దాలన్నీ మంచుతో గిలాబా చేసినట్టయిపోయాయి. లేకపోయుంటే పాపం, వారు ఇంకా ఎన్నో తమాషా తమాషా అయిన విషయాలను చూసి వుండేవారే.

సరి, ఎలాగైతేనేం ఒకనాడు ఉదయాన్నే ఒక చిన్న స్టేషనులో వాళ్లరైలు ఆగింది.

చుక్కునీ గెక్కునీ వాళ్లమ్మ ప్లాట్ఫారం మీదకి దింపి, ఆ ఎర్రసైనికుడు అందించుతూన్న సామాన్లన్నిటినీ వాళ్లమ్మ దించుకొన్న ఉత్తరక్షణంలోనే రైలు కదిలిపోయింది.

* * *



దింపుకొన్న పెట్టెలనీ మంచులోనే ప్లాట్ఫారంమీద కుప్పగా పెట్టారు. ఆ చెక్క ప్లాట్ఫారం మీద పిట్ట మనిషైనా లేడు. నాన్న జాడే లేదు. నాన్నమీద అమ్మకి చెడ్డ కోపం వేసుకొచ్చింది. సామాన్లను జాగ్రత్తగా చూస్తూండమని కొడుకులిద్దరితోనూ చెప్పి, తమకోసమని నాన్న ఏ స్లెయ్ బండిని పంపించాడో కనుకొద్దామని — అవును మరి, నాన్న వున్న మకాం చేరుకోవాలంటే మరో నూరు కిలోమీటర్లు తైగాలోంచి ప్రయాణం చెయ్యాలాయె — కాస్త దూరంలోవున్న స్లెయ్ బళ్లవాళ్ల దగ్గరకి అమ్మ వెళ్లింది.



అమ్మ వెళ్లి చాలా సేపయింది. ఈలోపున కోరచూపులు చూస్తూ మేక ఒకటి అక్కడ తారసిల్లింది. మొదటేమో అది అక్కడ మంచుకి కరడుకట్టుకు పోయున్న చెట్టు ఒకటుంటే ఆ చెట్టు బెరడును నమిలింది. తరువాత, అది అదోమోస్తరుగా 'మే, మే' అంటూ వాళ్లవేపు కళ్లెర్రజేసుకుని చూడ్డం మొదలు పెట్టింది.

దాంతో చుక్కుకీ గెక్కుకీ భయంవేసిపోయి, చప్పున ఆ పెట్టెల వెనకాల దాగున్నారు. ఈ ప్రాంతాల్లో మేకలు ఎలాంటివో, ఏంచేసి పోతాయో ఎవడు చెప్పగలడు, బాబూ!

సరిగా సమాయనికి వచ్చింది అమ్మ. ఆమె ముఖం చిన్నబోయుంది. తాము వేసిన టెలిగ్రాం




నాన్నకి బహుశా అందివుండక పోవచ్చుననీ, అందుచేతనే నాన్న స్లెయ్‌ని స్టేషనుకు పంపించలేదనీ అమ్మ చెప్పింది.

ఒక స్లెయ్ మనిషిని వాళ్లు పిలిచారు. అతడొచ్చి తన పెద్దకమిచీతో ఆ మేకకు ఒక చురక తగిలించి, తరువాత పెట్టెలను తీసుకెళ్లి స్టేషనులోవున్న ఫలహారపుశాలలో వుంచాడు.

ఫలహారపుశాల చాలా చిన్నది. కౌంటరు వెనకాల పెద్ద సమొవార్ ఒకటి — బొద్దుగా చుక్ అంత పెద్దది — బుస్ బుస్ మంటూంది. అది ఇటూ అటూ కదలుతూ ఈల వేస్తూంటే, దానిలోంచి ఆవిరి పొగర్లు గుబురుగుబురుగా మేఘాల్లా పైకిలేస్తూ సరంబీని అందుకుంటున్నాయి. బయటనున్న చలినుండి శరణు పొందుతూ ఆ సరంబీ కన్నంలో చేరుకున్న పిచ్చుకలు కొన్ని కిలకిలమంటూ ఎగురుతున్నాయి.

చుక్కూ గెక్కూ టీ తాగుతూన్న సమయంలో తల్లి స్లెయ్ మనిషితో అద్దె బేరంచేస్తూంది. తైగాలోనుండి తాము వెళ్లాల్సిన చోటకు తీసుకెళ్లడానికి ఆ స్లెయ్ మనిషి, అబ్బో బోలెడు అద్దె — నూరు రూబుళ్లు — అడిగాడు. నూరు రూబుళ్లంటే మాటలా! కాని ఆమాటకొస్తే, వెళ్లాల్సిన దూరం కూడా బోలెడుంది మరి. కొసకి ఎలాగైతేనేమి, బేరం కుదిరింది. స్లెయ్‌మనిషి, ప్రయాణంలో తన కోసమని రొట్టె, స్లెయ్‌లో పరచేందుకు గడ్డి, వాళ్లందరూ కప్పుకుందుకు గొర్రెబొచ్చు కంబళ్లూ తెచ్చుకుందుకని ఇంటికెళ్లాడు.

''అసలు మనం వచ్చామనే తెలీదు నాన్నకి. మనని చూసేసరికి నాన్న ఆశ్చర్యపడిపోయి పరమానంద భరితుడవుతాడు, ఏం?'' అంది అమ్మ.

''అవును, నాకూ పరమానందమే'' అన్నాడు గంభీరంగా చుక్ గుటలేసి టీ తాగుతూ.

''నాకూనూ'' అని వెనకపాట పాడాడు గెక్. ''మనం ఒక తమాషా చేద్దామే అమ్మా! చడీ చప్పుడూ లేకుండా దొంగాళ్లల్లా మనం ఇంట్లోమెల్లగా దూరి, నాన్న ఎక్కడికో వెళ్లిపోయుంటే, మన పెట్టెల్నెక్కడో దాచేసి, మనం మంచం కిందకి దూరిపోదాం. నాన్న గదిలోకి వచ్చి కూచుంటాడు. కూచుని ఏదో ఆలోచిస్తూంటాడు. మనమేమో ఊపిరి బిగబట్టుకుని కిక్కురు మనకుండా మంచంకింద దాగునే వుంటాం. తటాలున 'భౌ' మని ఒక్క కేకపెడదాం!''

''నేను ఏ మంచం కిందా దాక్కోనూ, ఏ 'భౌ' మనీ కేకేయనూ. మీాకంత సరదాగా వుంటే ఆ దాక్కోడాలూ ఆ 'భౌ' మనడాలు మీరే చేసుకోండి!'' అనేసింది అమ్మ. ''చుక్! ఆ పంచదార ముక్కలు ఎందుకలా జేబులో పడేసుకుంటున్నావు? ఇప్పుడు నీ జేబులో వున్నవి చాలవనా? ఇప్పటికే నీ జేబులు వొర్తి చెత్తడబ్బాల్లా తయారయాయి'' అని కోప్పడింది తల్లి.

''గుర్రాలకి పెడదామనే, అమ్మా'' అని చుక్ ప్రశాంతంగా తల్లికి బోధపరుస్తూ జబాబు చెప్పాడు. ''ఒరేయ్ గెక్! నువ్వు కూడా ఒక రొట్టె జేబులో వేసుకోరా. నువ్వేమీ జాగ్రత్త చెయ్యవు. మాటిమాటికీ అన్నీ నన్నే అడుగుతావు గానీ!'' అన్నాడు చుక్ తమ్ముడితో.



కాస్సేపటికల్లా స్లెయ్‌మనిషి వచ్చేశాడు. విశాలంగావున్న స్లెయ్‌లోకి సామాన్లనన్నీ ఎక్కించి, స్లెయ్ అడుగున గడ్డి పరచి, కుర్రాళ్లని స్లెయ్‌లో కూచోపెట్టి వాళ్లకి బూర్నీసులు ముసుగేసి, గొర్రె బొచ్చు కంబళ్లతో కప్పేశారు. వాళ్ల వెనకాల కూచుంది తల్లి.

మహాపట్టణాలు, ఫ్యాక్టరీలు, రైలుస్టేషన్లు, గ్రామాలు, పల్లెలు — అన్నిటికీ ఒక సెలవు! ముందున్నది కేవలం అరణ్యాలూ పర్వతాలూ — అవి దాటాక ఇంకా మహారణ్యాలూ కీకారణ్యాలూనూ.

* * *

బహు పురాతనమైన ఆ తైగా అద్భుత సౌందర్యాన్ని ''ఆహాహా!'' అనీ, ''ఓహోహో!'' అనీ అచ్చెరువు పడుతూ, చీకటి పడేవరకూ మంచి సర్దాగా అలా ప్రయాణం చేశారు. కాని బండిమనిషి వెనకాలవున్న స్థలంలో చుక్ కూచోవడంచేత చుక్కుకి రోడ్డేమీ అంత బాగా కనబడిందికాదు. అందుకని చుక్ చికాకు పడ్డం మొదలెట్టి, తల్లిని కజ్జికాయో అప్పచ్చో ఇమ్మనమని అడిగాడు.

తల్లి కజ్జికాయా ఇవ్వలేదు, అప్పచ్చి అంతకంటే ఇవ్వలేదు — అవును మరి. దాంతో చుక్ ముఖం గంటు పెట్టుకుని కాస్సేపు సణుగుడు సణిగి, మరేమి చేసేందుకూ తోచక, మెల్లిగా జరిగి జరిగి, పక్కను కూచున్న గెక్కుని స్లెయ్ అంచుకేసి తోసి నొక్కడం మొదలెట్టాడు.

గెక్ ఏమనకుండా మొదట ఓర్పుతో ప్రతిఘటించాడు. కాని చుక్ ఇంకా నొక్కుతూంటే, ఇక మరి ఓర్చుకో లేక, చుక్‌మీద ఉమ్మేశాడు గెక్. దాంతో చుక్ ఒళ్లు మండిపోయి, గెక్ మీదకి లంఘించాడు. కాని వాళ్లమీద బరువైన గొర్రెబొచ్చు కంబళ్లు వేసివుండడంచేత, చేతులు కదపుకోడానికి వాళ్లకి వీలైందికాదు. ఇక ఏమి చేయడానికీ చేతకాక, బూర్నీసులతో ముసుగులు కప్పివున్న తలకాయలతో ఒకరినొకరు ఢీ కొట్టుకుంటూ కూచున్నారు.

వాళ్లవెనకాల కూచున్న తల్లి ఇదంతా చూస్తూ నవ్వుకుంది. సరిగా ఆ క్షణమే స్లెయ్‌మనిషి గుర్రాలకి కమిచీ రుచిచూపించడంచేత, తటాలున అవి వాయువేగ మనోవేగంతో పరుగెత్తాయి.

తెల్ల బొచ్చు చెవులపిల్లులు రెండు రోడ్డు మధ్యకి బంతుల్లా గంతులేసుకుంటూ వచ్చి నాట్యం చేయడం మొదలెట్టాయి.

''హేయ్, హేయ్, తప్పుకోండి! జాగ్రత్త!'' అంటూ స్లెయ్‌మనిషి అరిచాడు.

ఆ పెంకె చెవులపిల్లులూ రెండూ చెంగు చెంగుమని దాట్లు వేసుకుంటూ అడవిలోకి పారిపోయాయి.

ములుకుల్లాంటి చలిగాలి రైంయ్ రైంయ్ మంటూ వారి ముఖాలమీద కొడుతూంది. ఆ చలిగాలికి తట్టుకుందుకని చుక్కూ గెక్కూ ఒకరి నొకరు గట్టిగా కౌగిలించుకోకుండా వుండలేక



పోయారు. ఆత్రైగా కొండల దిగుడులో, దగ్గరపడుతూన్న శ్యామల పర్వతాల అంచులనుండి ఉదయించు తూన్న చంద్రుని దిశగా స్లెయ్ ఝామని ఉరుకులేసుకుంటూ పరుగెడుతూంది.

నిండు పరుగులోవున్న గుర్రాలు, మంచులో కూరుకుపోయున్న ఒక చిన్న గుడిసె ఎదుట వాటం తటవే చటుక్కున ఆగిపోయాయి.

''ఈ రాత్రికి ఇక్కడే మన మకాం. ఇదీ మన మజిలీ'' అంటూ బండిమనిషి స్లెయ్ మీదనుండి దిగాడు.

ఆ గుడిసె చిన్నదే అయినా, దృఢంగా వుంది. పోతే, దానిలో ఎవ్వరూ లేరు, ఖాళీగానే వుంది.

వెంటనే పొయ్యిమీద కెటిల్‌తో నీళ్లు మరగబెట్టాడు స్లెయ్‌మనిషి. నీళ్లు మరిగే లోపుగా వాళ్లు తెచ్చుకున్న ఫలహారపు పెట్టెని స్లెయ్‌లోనుండి పట్టుకొచ్చి వాళ్ల దగ్గర పెట్టాడు.

ఆ పెట్టెలోనుంచి ఒక సాసేజిని తీశారు. ఆ సాసేజి ఎంత గట్టిపడిపోయిందంటే దాంతో గోడకి మేకు దిగ్గొట్టొచ్చు — అంత రాయిలా గడ్డకట్టుకు పోయిందది. దానిని మరుగునీళ్లలో నానబెట్టారు. రొట్టెను ముక్కలుకింద కోసి, ఆ ముక్కలను పొయ్యిమీద కాల్చుకున్నారు.

పొయ్యిగూడు వెనకాల ఏముందో చూదామని కెలుకుతూండగా, వొంపుతీసిన స్ప్రింగు ఒకటి



చుక్కకి దొరికింది. జంతువులను పట్టుకుందుకు ఉపయోగించే బోనులో ఆ స్ప్రింగు ఒక భాగమని చెప్పాడు ఆ స్లెయ్‌మనిషి చుక్కతో.

స్ప్రింగు తుప్పుపట్టి వుంది. దీన్నిబట్టి ఆ స్ప్రింగును ఈమధ్య ఎవ్వరూ వాడుక చేసివుండ లేదని చుక్ వెంటనే గ్రహించేశాడు.

రాత్రి ఫలహారం చేశాక అందరూ పడుకున్నారు. బల్లమంచం ఒకటి గోడవారనే వుంది. ఆ మంచంమీద ఎండిపోయిన ఆకులు పరచి వున్నాయి. అదే పరుపు అన్నమాట. గోడవార పడుకోవడ మన్నా, మధ్యను పడుకోవడమన్నా గెక్కుకి గిట్టదు. వెలపలకేసి పడుకోవడమే గెక్కుకి ఇష్టం. తాను ఇంకా బాగా పసిపిల్లాడుగా వున్నప్పుడు తనను నిద్రపుచ్చడానికని: "జో, జో, నా ముద్దుల గుమ్మా — వెల పలకేసి పరుంటే దొర్లిపడతావు ముద్దుల బొమ్మా" అని పాడిన జోలపాట తనకింకా జ్ఞాపకమేవున్నా, గెక్ ఎప్పుడూ మంచంమీద వెలపలకేసే పడుకునేవాడు.

కర్మం చాలక మధ్య పడుకున్నాడో, అటూ ఇటూ పడుకున్నవాళ్ళకి లేకుండా తనకొక్కడి కోసమే బూర్నీసు నంతా లాగేసుకుని, అవతలవాడినీ ఇవతలవాడినీ మోచేతులతో కుమ్మేసి మోకాళ్ళతో చుక్ పొట్టలో పొడిచేసేవాడు.

వాళ్ళు ముగ్గురూ ప్రయాణంచేసిన దుస్తులతోనే పడుకుని ఆ గొర్రెబొచ్చు కంబళ్ళే కప్పుకు న్నారు. చుక్ గోడకేసి పడుకున్నాడు. గెక్ వెలపల కేసి పడుకున్నాడు. ఇద్దరికీ మధ్యను తల్లి పడుకుంది.

స్లెయ్‌మనిషి కొవ్వొత్తి ఆర్పేసి పొయ్యిగూటి మీదికెక్కి పడుకున్నాడు. పడుకునీ పడుకోడం

తోనే అందరికీ నిద్రపట్టిపోయింది. అయితేనేం, యథాప్రకారంగా గెక్కుకి అర్ధరాత్రప్పుడు నిద్రలో దాహంవేసి తెలివొచ్చింది.

ఇంకా ఆ నిద్దరమత్తుతోనే లేచి, తన ఫెల్ట్ బూడ్సులు తొడుక్కుని, బల్లదగ్గరకి చేరుకుని, కెటిల్లోవున్న నీళ్లు తాగి, కిటికీ దగ్గర ఎత్తుగావున్న ముక్కాలిపీట ఒకటుంటే దానిమీదకెక్కి కిటికీలోనుండి చూస్తూ కూచున్నాడు.

మేఘాల చాటున దాగున్నాడు చందమామ. మంచుపూత పూసిన కిటికీ అద్దాల్లోనుంచి బయటనున్న మంచుకుప్పలు నల్లగా నీలంగా కనబడుతున్నాయి.

''ఇంకా ఎక్కడో భూమి చివరనుండాలి నాన్న!'' అనుకున్నాడు గెక్. ''ఇంత దూరం వచ్చాం కదా, ఇక్కడకంకా దూరమైన వూళ్ళు ప్రపంచంలో ఇంకేముంటాయి గనక?'' అని తలపోశాడు గెక్.

ఇంతట్లో గెక్కుకి ఏదో వినబడినట్టు అయింది. కిటికీ వెనకాల ఎవరో తలుపు కొడుతూన్నట్టు అనిపించింది. అబ్బే, ఇది తలుపు కొట్టడం చప్పుడు కాదు, ఎవరో బరువుగా అడుగులు వేస్తూ నడుస్తూంటే, ఆ అడుగుల కింద మంచు కరకరమంటూంది అనుకున్నాడు. ఆ! ఇప్పుడు తెలిసింది! అవతల చీకట్లో బుస్ బుస్సుమని ఊపిరితీస్తూ, జోగుతూ అడుగులు వేసుకుంటూ ఏదో నడుస్తూంది. అది తప్పకుండా ఎలుగ్గొడ్డే అయివుండాలని నిశ్చయించుకున్నాడు గెక్.

''ఓసి, దుష్ట ఎలుగ్గొడ్డా! నీకేంకావాలని ఇక్కడికొచ్చావు? మానాన్న దగ్గరకి మేం వెళ్లడం ఆలస్యమవుతూందని చెప్పి, మానాన్నని మేం ఇక ఎన్నటికీ చూడకుండా వుండాలని మమ్మల్ని మింగే





సేందుకు వచ్చావేం? అబ్బే, ఇక నీ ఆటలేం సాగవు! ఎవరేనా వచ్చి నిన్ను తుపాకీతో కాల్చేనా కాల్చేస్తారు, లేకుంటే వాడియైన పట్టాకత్తితో నరికేసేనా నరికేస్తారు. అంచేత ఆ పాట్లేవో పడకుండానే వెంటనే పారిపో, తెలిసిందా!'' అన్నాడు గెక్.

మంచుపూత పూసిన ఆ సన్నగా కోలగావున్న కిటికీ అద్దానికి తన ముఖాన్నీ ముక్కునీ గట్టిగా నొక్కిపెట్టి కిటికీలోంచి చూస్తూ గెక్ ఇలా గొణిగాడేమో, తన నోటనుంచి ఆ మాటలు ముక్కిడిగా వచ్చాయి. ఎలుగ్గొడ్డు అవతలే వుందని అనుకోగానే గెక్కుకి భయమూ వేసింది, కాని ఏం జరుగుతుందో చూడాలనీ అనిపించింది.

కాని సరిగా ఆ సమయానికే ఆకాశంమీద పరుగెత్తుతూన్న మేఘాల చాటునుండి చంద్రుడు చటుక్కున పైకొచ్చాడు. ఇంతవరకూ నల్లగా నీలంగా కనబడిన మంచుకుప్పలు ఇప్పుడు వెన్నెట్లో, కగ్గిపోయిన వెండిలా తెల్లగా మెత్తగా కనబడ్డాయి. ఇక ఇంతాచేస్తే — ఎలుగ్గొడ్డు అని తాననుకున్నది ఎలుగ్గొడ్డు కానేకాదు, కట్టు తెంపేసుకుని కాలు నేలని కొడుతూ స్లెయ్ చుట్టూ తిరుగుతూ అందులో వున్న గడ్డిని నమలుతూన్న గుర్రం!

గెక్కుకి ఎంతో ఆశాభంగ మనిపించింది. వెళ్లి కంబళీ కింద దూరిపోయి పడుకున్నాడు. భయంకరమైన సంగతులను గురించే ఇంతసేపూ గెక్ ఆలోచించడంచేత, నిద్రలోనూ పాడుకలే వచ్చింది గెక్కుకి.

భయానక స్వప్నము పీడించె గెక్కును,
బలిరక్కసి యొక్కటి గెక్కును గని
నిప్పులు గ్రక్కుచు పొగ శ్వాసించుచు
ఉక్కు పిడికిలి బిగించి కోరలిగిలించె.
కార్చిచ్చులు మంచుమైదానాల్ దాటుచు –
చొచ్చిరి కిరాతులు బారలు తీర్చి కదంతొక్కుచు.
తెచ్చిరి తమతో సర్వాసహ్యమగు
రొచ్చుగుంట రక్కసి స్వస్తిక జెండా.

"హేయ్, ఆగండి! ఇలా వచ్చేందుకు వీల్లేదు! మిమ్మల్నిలా రానివ్వం!" అని గెక్ వాళ్లమీద కేక లేశాడు.

కాని ఎవ్వరూ ఆగలేదు, గెక్కుని ఎవ్వరూ వినిపించుకోలేదు.

అందుపైని గెక్ రౌద్రుడైపోయి, బాకా ఒకటుక్కడుంటే దాన్ని తీసుకుని – జోళ్లపెట్టెలో చుక్ దాచుకున్న బాకావే అది – గట్టిగా వూదాడు. గెక్ ఎంత గట్టిగా వూదాడంటే, అంత ఆలోచన



లోనూ మునిగివున్న ఆ కవచశకటం రైలు కమాండరూ కూడా చటుక్కున వెనక్కి తిరిగి చూసి, చెయ్యి వూపాడు. కమాండరు చెయ్యివూపి సంజ్ఞ చేసేసరికల్లా, అతని చేతికిందవున్న ఆ భయంకరమైన భారీ ఫిరంగులన్నీ ఒక్క పాళంగా ధామ్మని గర్జించాయి.

''భేష్! మరొక చురక కూడా తగిలించు. ఒక్క దెబ్బేస్తే వాళ్లకి చాలదు!'' అని మెచ్చుకుంటూ కేకేశాడు గెక్.

* * *

తన ముద్దుల కొడుకులిద్దరూ నిద్దట్లో ఇటూ అటూ దొర్లుతూ కాళ్లూ చేతులూ విసురు కుంటూంటే తల్లికి తెలివొచ్చింది.

ఆమె చుక్ వైపు తిరిగింది. తిరిగేసరికల్లా ఏదో సూదిగా గట్టిగా ఆమెకు పార్శ్వంలో గుచ్చు కుంది. ఇదేమిటని ఆమె చేతితో తడిమి దానిని పైకితీసే సరికి — ఇందాకలా చుక్ సంపాదించిన ఇనుప స్ప్రింగే. దానిని తాను ఎక్కడ పారేసుకుంటానో అని భయపడి పాదుపరి చుక్ దానిని రహస్యంగా చేతితో పట్టుకునే నిద్రపోయాడు.

దానిని తీసి ఆమె మంచంవార విసిరేసింది. తరువాత ఆ వెన్నెట్లో గెక్ ముఖంకేసి చూసింది. పాపం పాడుకలలు కంటున్నాడని పోల్చుకుంది.

పాడుకల స్ప్రింగులాంటిది కాదుగా. స్ప్రింగును తీసి పారేయొచ్చు, గాని పాడుకలను తీసి పారేయ లేమే. అయితేనేమి — పాడుకలను 'ఉఫ్'మని వూదేయొచ్చు. అందుకని ఆమె గెక్కుని ఒత్తిగిలించి నెమ్మదిగా ఊపుతూ జేవురించివున్న ఆ చిన్ని నుదుటిమీద చల్లగా వూదింది.

కాస్సేపటికల్లా పెదవులు చప్పరించుకుంటూ నిద్దట్లో గెక్ చిరునవ్వు నవ్వాడు. ఆ పాడు కలేదో ఇక ఎగిరిపోయిందని తల్లికి తెలిసిపోయింది.

ఇదంతా అయాక, మేజోళ్లకాళ్లతోనే తల్లి కిటికీ దగ్గరకెళ్లింది.

ఇంకా తెల్లవారలేదు. ఆకాశం నిండా నక్షత్రాలింకా మెరుస్తూనే వున్నాయి. కొన్ని తారలు ఎంతో దూరాన మిణుకు మిణుకు మంటున్నాయి, కొన్ని సరాసరి తైగామీద వెలుగుతున్నాయి.

నిజంగా ఆశ్చర్యమే! ఆ కిటికీ దగ్గర ఆమె కూచుని, చిన్నపిల్లడు గెక్ తలపోసి విస్తుపోయినట్టే, సాహసిక కృత్యాలంటే చెవికోసుకునే తన పెనిమిటికి ప్రపంచంలో ఇంతకంటె దూరాతిదూరమైన మారుమూల స్థలం మరొకటి దొరకలేదు కాబోలునని ఆమె కూడా తల్చుకుని విస్తుపోయింది.

* * *

మరునాడంతా ప్రయాణం చేశారు — ఎక్కేకొండా దిగేకొండా, అడవులూ అరణ్యాలూ. కొండ ఎక్కాల్సొస్తే, బండిమనిషి స్లెయ్‌నుండి దిగిపోయి స్లెయ్ పక్కనే మంచులో నడిచేవాడు. ఇక



దిగుడొచ్చే సరికి స్లెయ్ ఎంత వేగంగా దూసుకు పోయేదంటే, తమతో సహా స్లెయ్‌బండీ, గుర్రాలూ, అన్నీ ఒక్కపాళంగా ఆకాశంనుండి సరాసరి భూమిమీదకి రాలిపోతూన్నట్టే అనిపించేది చుక్కుకీ గెక్కుకీ.

చిట్టచివరకు ప్రయాణికులూ గుర్రాలూ ఇంకొక్క పిసరైనా సత్తువలేకుండా పూర్తిగా అలసి పోగా, సందెచీకటి వేళకి స్లెయ్‌మనిషి అన్నాడు:

"హమ్మయ్యా, వచ్చామండీ! ఇదిగో, ఈ కొండ అంచు మలుపు తిరిగామంటే సరి, అక్కడున్న పోదు జాగాయే వాళ్ల మకాం... ఛల్, ఛల్, వెయ్యండ్రా అడుగు!" అంటూ అతడు గుర్రాలను మం దలించాడు.

చుక్కూ గెక్కూ ఇక సంతోషం పట్టలేక స్లెయ్‌లోనే లేచి నిలబడి అరుస్తూ గంతులేస్తు న్నారు. సరిగా ఆ నిమిషానికే గుర్రాలు ఒక్క ఊపుతో స్లెయ్‌ని లాగేసరికి ఆ కుదుపుకి వాళ్లిద్దరూ స్లెయ్‌లో చతికిలబడ్డారు.

అది చూసి వాళ్లమ్మ నవ్వుకుంది. తన ఫర్‌టోపీపై చుట్టుకున్న ఉన్ని మఫ్లరును ఆమె తీసే సుకుంది.

కొండ మలుపు వచ్చింది. స్లెయ్ వొయ్యారంగా మలుపు తిరిగింది. అడవిలో ఈదరగాలి తగల కుండా ఒక చోట పోదు పెట్టివుంది. ఆ పోదులో చిన్నవి మూడు ఇళ్లున్నాయి. సరిగా ఆ చోటనే ఆగింది స్లెయ్.

ఇదేమిటీ చిత్రం! ఒక్క కుక్క అయినా మొరగడం లేదు సరేకదా, గుండేసి పేల్చినా మనిషి కన బడడే! ఇళ్లకున్న పొగగొట్టాల్లోనుండి అసలు పొగ అంటూ రావడమే లేదు! బాటలపైన మంచు దట్టంగా అంతెత్తు పడుంది! ఎక్కడా చడీ చప్పుడూ లేకుండా, చలికాలంలో శ్మశానం ఎంత నిశ్శబ్దంగా వుం టుందో ఇక్కడా అంత నిశ్శబ్దంగానూ వుంది. ఏవో నాలుగు తెలుపూ నలుపూ గోరింకలు మాత్రం ఆ చెట్టునుండి ఈ చెట్టుకీ ఈ చెట్టునుండి ఆ చెట్టుకీ పిచ్చిపిచ్చిగా ఎగురుతున్నాయి — అదే అక్కడున్న అలికిడి అంతానూ.

"ఎక్కడికి తీసుకొచ్చావయ్యా మమ్మల్ని? మేం రావాల్సింది ఇక్కడకే?" అని గాభరాపడుతూ అమ్మ స్లెయ్‌మనిషిని అడిగింది.

"ఇక్కడికి బేరంచేశారు, ఇక్కడికి తీసుకొచ్చాను. మరి నన్నేం చెయ్యమంటారు? ఈ ఇళ్లనే 'జియలాజికల్ రిసెర్చి స్టేషన్, నెంబరు 3' అంటారు. ఆ స్తంభానికున్న బోర్డు చూశారా? నా మాట నమ్మకపోతే బోర్డు చదువుకోండి. ఇంతకీ, మీకు కావాల్సింది నెం.4 స్టేషనేమో? మరామాట చెప్పరేం! అది రెండొందల కిలోమీటర్లుంది రైలుస్టేషనుకి అటుదిక్కు", అన్నాడు స్లెయ్‌మనిషి.

"కాదు, కాదు" అంది అమ్మ బోర్డు చదువుకుని నివ్వెరపోతూ. "మేం రావాల్సింది ఇక్కడకే. కాని, ఇళ్లన్నీ తాళాలు వేసున్నాయి, గుమ్మంలోనూ వాకిట్లోనూ మంచు మేటేసి వుందాయె — నువ్వు చూస్తున్నావుగా! మరి, ఇక్కడ వాళ్లందరూ ఎక్కడున్నట్టు?" అంది అమ్మ.

"వాళ్లందరూ రెక్కలుకట్టుకు ఎక్కడికి మాయమైపోయారో నాకేం తెల్సు, తల్లీ!" అన్నాడు స్లెయ్‌మనిషి తాను కూడా ఆశ్చర్యపోతూ. "కిందటి వారం ఇక్కడికి సామాన్లు తెచ్చాం: గోధుమనూక, ఉల్లిగడ్డ, బంగాళాదుంపలూనూ. అంతా మొత్తం ఎనమండుగురు — పెద్దాయనను కలుపుకొని తొమ్మిది, కావలిజవాన్ని కూడా లెక్కేసుకుంటే — వెరశి మొత్తం పదిమంది జనం. ఇందరినీ తోడేళ్లు మింగేసి వుండవే... మీరిక్కడే వుండండి, నేను కావలిజవాను ఇంటికెళ్లి వాకబు చేసుకొస్తాను."

అలా అంటూ, తన గొర్రెబొచ్చు తోలుకోటును తీసిపారేసి, మేటవేసిన మంచులో కాళ్లు కూరుకు పోతూంటే, అడుగులు తీసి అడుగులు వేసుకుంటూ, ఆ చివరనున్న గుడిసెకేసి వెళ్లాడు స్లెయ్ మనిషి.

కాస్సేపటికల్లా అతడు వచ్చేశాడు.

"గుడిసెలో ఎవ్వరూ లేరు, కాని, పొయ్యి మాత్రం వెచ్చగా వుంది. అనగా దాని అర్థం, కావలి జవాను ఎక్కడో ఈ చుట్టుపక్కలే వున్నాడన్నమాట — బహుశా వేటకి వెళ్లుంటాడు. రాత్రికి వచ్చే స్తాడులెండి. అతగాడు వచ్చాక మీకు కావాల్సిన తబిసీళ్లన్నీ చెబుతాడు" అన్నాడు స్లెయ్‌మనిషి.

"అతడు మాత్రం ఏం చెప్పగలడు గనక!" అంది అమ్మ వెంటనే. "ఇక్కడివారందరూ ఏనాడో వెళ్లిపోయారన్న సంగతి నాకే కనబడుతూంది ప్రత్యక్షంగానూ."



అతగాడేం చెబుతాడో చెందుతాడో నాకేం ఎరుక? కావలిజవాను కాబట్టి ఏదైనా చెప్పక పోతాడా?'' అన్నాడు స్లెయ్‌మనిషి.

ఆ మంచులో ఎంతో కష్టంమీద కావలిజవాను గుడిసె దగ్గరకు వెళ్లగల్గారు స్లెయ్‌మీద. ఆ గుడిసెనుండి అడవిలోకి ఇరుకుగా సన్నని కాలిబాట ఒకటి కనబడుతూంది.

గుడిసె ముందువసారాలోకి వెళ్లారు వాళ్లు. వసారా నిండావున్న పారలూ, చీపుళ్లూ, పిక్కాసులూ, బాజులనూ తప్పుకుంటూ, గోడమీద ఇనుపకొక్కానికి వేలాడదీసి, సగం సగం గడ్డకట్టి పోయున్న ఎలుగ్గొడ్డు తోలు పక్కనుండే నడుచుకుని, వాళ్లు గదిలోకి వెళ్లారు. సామాన్లు పట్టుకుని వాళ్లవెంట వచ్చాడు స్లెయ్‌మనిషి.

గుడిసెలో వెచ్చగా వుంది.

గుర్రాలకు దాణా పెట్టేందుకని స్లెయ్‌మనిషి బయటికెళ్లాడు. ఆ నిశ్శబ్దంలో భయంతో బెంబేరెత్తిపోయిన ఆ కుర్రాళ్లిద్దరూ తమ బొచ్చు కంబళ్లనూ, బూర్నీసులనూ తల్లి సహాయంతో విప్పుకున్నారు.

''ఇంత దూరమూ మీ నాన్నకోసమని ప్రయాణం చేసి చేసి వచ్చేసరికల్లా, మీ నాన్న లేడాయె!''

అలా అంటూ అమ్మ బెంచిమీద చతికిలపడి వూరికే ఆలోచించింది. ఏమిటి జరిగింది? మకాం

అంతా ఖాళీగా వుండడానికి కారణమేమిటి? ఇప్పుడేం చెయ్యడం? తిరిగి ఇంటికి వెళ్లిపోవడమా? చేతిలో డబ్బు చూస్తే స్లెయ్‌మనిషికి అద్దె ఇవ్వడానికే సరిగా సరిపోతుందాయె. కావలిజవాను కోసం పడి కాపులు కాసుక్కూచోవాలి, అంతే మరి. కాని — స్లెయ్‌మనిషి మరో మూడు గంటల్లో వెళ్లిపోతాడే. అప్పటికి గనక కావలిజవాను రాకపోతే — అప్పుడేమిటి చెయ్యడం? అక్కడకు దగ్గరున్న రైలుస్టేషనూ, టెలిగ్రాఫు ఆఫీసూ అర పావు తక్కువగా నూరు కిలోమీటర్ల దూరంలో వున్నాయాయె.

స్లెయ్‌మనిషి వచ్చాడు. గది నలుమూలలా పరికించి గట్టిగా నిట్టూర్చి, పొయ్యిగూటి దగ్గర కెళ్లి, పొయ్యిగూటి తలుపు తీసి, అందులో ఏమేనా వుండేమోనని చూశాడు.

''చీకటి పడేలోపుగా కావలిజవాను వచ్చేస్తాడులెండి'' అని స్లెయ్‌మనిషి వాళ్లకి ధైర్యంచెప్పి, ''ఇదిగో, ఇక్కడో గిన్నెనిండా కేబేజీ పులుసుంది, చూడండి! అతగాడు దూరాభారమే వెళ్లివుంటే, పులుసు చల్లారబెట్టేందుకు బయటే వుంచేసేవాడు, వెచ్చగా వుంచడు. సరి, ఇక మీరే మంచి చెడ్డలు ఆలోచించుకుని మీకెలా బాగు అని తోస్తే అలా చెయ్యండి. సంగతి సందర్భాలు నాకూ అర్థమయాయి — అంత మట్టిబుర్రకాదు నాది. మీరు వచ్చేసేమాటుంటే, తిరుగు ప్రయాణానికి అద్దె పుచ్చుకోకుండానే మిమ్మల్ని రైలుస్టేషనుకి తీసుకెళ్లి దింపేస్తాను'' అన్నాడు.

''వద్దయ్యా'' అంది అమ్మ, ''రైలుస్టేషనుకి నువ్వు తీసికెళితే మాత్రం మేమక్కడ చేసేదేముంది గనక?''

మళ్లీ మరొకసారి కెటిల్లో నీళ్లు మరిగించి, సాసేజిని వెచ్చచేసుకుని, ఫలహారంచేసి, టీ తాగారు. తల్లి సామాన్లు విప్పి, వస్తువులు పైకి తీస్తూండగా చుక్కూ గెక్కూ ఆ వెచ్చని పొయ్యిగూటి మీది కెక్కారు. వాళ్లకక్కడ బర్చి చిదుగులూ, వెచ్చని గొర్రెబొచ్చు తోళ్లూ, దేవదారు చెక్కూ — వీటి వాసన కొట్టింది. తల్లి కలవర పడుతూ, మాటా మంతీ లేకుండా అలా వూరికేనే వుండడంచేత, చుక్కూ గెక్కూ కూడా గొడవచెయ్యకుండానే కూచున్నారు. కాని ఎంతసేపని వాళ్లు నోరు కట్టుక్కూచోగల్గుతారు? మరేపనీ లేదాయె. అందుచేత చుక్కుకీ గెక్కుకీ మరో గడియకల్లా వొంటిమీద తెలివి లేకుండా మొద్దునిద్దర పట్టిపోయింది.

స్లెయ్‌మనిషి వెళ్లిపోవడమూ వాళ్లకి తెలియదు, తల్లి పొయ్యిగూడు ఎక్కి వాళ్ల పక్కనే పడుకోవడమూ వాళ్లకి తెలియదు. వాళ్లకి తెలివొచ్చేటప్పటికి గుడిసెలో అంధకారంగా వుంది. ముందు వసారాలో ఎవరో కాళ్లు దులుపుకుంటూన్నట్టు చప్పుడైతే ఆ చప్పుడుకు వాళ్లు ముగ్గిరికీ మెలకువొచ్చింది. వసారాలో ఏదో నేలమీద జారిపోయినట్టు ఫెళఫెళమని శబ్దమైంది — బహుశా ఏదో పార అయివుంటుంది. తలుపుతెరుచుకుని, చేతిలో లాంతరు పట్టుకుని కావలిజవాను గదిలోకొచ్చాడు. అతని వెంట పెద్ద బొచ్చుకుక్క ఒకటి లోపలికొచ్చింది.



బుజంమీద వేలాడుతూన్న తుపాకిని నేలమీదకి జార్చేసుకుని, వేటనుండి తెచ్చిన చెవుల పిల్లిని అక్కడున్న బెంచిమీద గిరవాటేసి, చేతిలోవున్న లాంతరును పొయ్యిగూటికేసి ఎత్తి:

"ఎవరీ వచ్చిన అతిథులు?" అని అడిగాడు.

"భూగర్భశాస్త్ర పరిశోధక బృందం నాయకుడు సెరేగిన్ భార్యని నేను. వీళ్లిద్దరూ మా పిల్లలు. మీకింకా కావలిస్తే ఇవిగో మా కాగితాలు చూసుకోండి" అంది అమ్మ పొయ్యిగూడు దిగుతూనూ.

"ఏ కాగితాలూ చూడక్కర్లేదూ – పొయ్యి గూట్లో కూచున్న ఈ కాగితాలు చూస్తే చాలు" అంటూ కావలిజవాను లాంతరెత్తి అసలే గాభరా పడుతూన్న చుక్కూ గెక్కూ ముఖాలను అట్టే పరికించాడు.

"మూడు మూర్తులా తండ్రి ముఖమే – అందులోనూ ఈ వుండ్రంముక్కమరీనీ!" అంటూ చుక్కూకేసి వేలుపెట్టి చూపించుతూ అన్నాడు కావలిజవాను.

చుక్కూకీ గెక్కూకీ ఇద్దరకీ చిన్నతన మనిపించింది. తానేమో వుండ్రంం ముక్కలా వున్నానని అతడు అన్నందుకు అతనిమీద చుక్కూకీ, చుక్కూకంటె తనకే తండ్రి పోలికలు హెచ్చుగా వున్నప్పటికీ అతడలా అనలేదే అని అతనిమీద గెక్కూకీ, ఇద్దరకీ కావలిజవాను మీద కోపం వచ్చింది.



014

''మీరెందుకు అసలు బయల్దేరి వచ్చారు? మిమ్మల్ని బయల్దేర వద్దని ఆర్డరు వేశారుగా!'' అంటూ అమ్మకేసి చూస్తూ అతడు ప్రశ్నించాడు.

''బయల్దేరవద్దనడన మేమిటి? ఆర్డరు వేయడమేమిటి? ఎవరా ఆర్డరు వేసింది?''

''ఆర్డరేశారు. నాకు తెలుసు. సెరేగిన్ రాసిచ్చిన టెలిగ్రాంను నేనే స్వయంగా వెళ్లి రైలు స్టేషనులో ఇస్తినిగా. అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్టు స్పష్టంగా వుందాయె టెలిగ్రాంలో: 'రెండు వారాలవరకూ ప్రయాణం ఆపుచెయ్యండి. బృందం అతి తొందర పనిమీద తైగాలోకి వెళ్తూంది' అని. 'ఆపుచెయ్యండి' అని సెరేగిన్ ఎప్పుడైతే రాశాడో, దాని అర్థం ఆపుచెయ్యమని ఆర్డరేయడమే, మరేమిటి? పోతే, మీరేమో మొండికేసి మొరాయించి ఆర్డరు ధిక్కరించారాయె!''

''టెలిగ్రాం అంటావు, వేశారంటావు. టెలిగ్రాం గిలిగ్రాం మాకేదీ అందందే!'' అంది తల్లి. అలా అంటూ, తన మాటలను రూఢిపరచమన్నట్టుగా చుక్కకేసీ గెక్కకేసీ తికమకపడుతూ చూసింది తల్లి.

వాళ్లిద్దరూ భయపడిపోయి ముఖంముఖం చూసుకుని గబాగబా పొయ్యిగూటి దగ్గరకు జారుకున్నారు.

దాంతో తల్లికి అనుమానం వేసి, కొడుకులిద్దరికేసి చూస్తూ: ''ఏమ్రా! నేను ఇంట్లో లేనప్పుడు ఏదైనా టెలిగ్రాం వచ్చిందా?'' అని తల్లి గద్దించి అడిగింది.



పొయ్యిలో ఎండు చిదుగులూ, దేవదారు చెక్కూ మండుతూ టపటప మంటున్నాయి. కాని, ప్రశ్నకు మాత్రం జబాబు లేదు.

''జబాబు చెప్పండ్రా! నా ప్రాణాలు తీసేస్తున్నార్రా మీరు!'' అంటూ తల్లి గదమాయించింది. ''నేనింట్లో లేనప్పుడేదైనా టెలిగ్రాం వస్తే దాన్ని మీరందుకుని, తరువాత నాకివ్వడం మర్చిపోయారా?''

కొన్ని క్షణాలు గడిచాయి. తటాలున పొయ్యిగూటినుండి ఖ్యాంయ్ బొంయ్ మంటూ ఒక్క జంట కేక వినబడింది. ఆ యుగళగీతిలో చుక్ మంద్ర స్థాయి యెత్తుకోగా, గెక్ షడ్జమం అందుకుని ముక్తాయింపు చూసుకున్నాడు.

''ఆరె, పెంకె ఘటాలా! మీతో నేనిక వేగలేనురా. నేను పోయి ఏనుయ్యో గొయ్యో చూసుకోవాల్రా, బాబూ! ఆ శకిలింపు ఇక అక్కడికి ఆపి, అసలు జరిగిందేమిటో ఏడవండి!'' అంది తల్లి గట్టిగానూ.

నుయ్యో గొయ్యో చూసుకోడానికి తల్లి వెళ్తాననడం వినగానే, చుక్కూ గెక్కూ పెంకులెగిరి పోయేటట్టు మరింత గట్టిగా మొర్రోమని ఏడ్చేశారు.

కొసకి ఎలాగైతేనేమి, బాగా కొంతసేపయాక, నీదే తప్పు అంటే నీదే తప్పు అని సిగ్గూ ఎగ్గూ లేకుండా ఒకరిమీద ఒకరు నీలాపనిందలు వేసుకుంటూండగా, ఆ నడుమ అసలు జరిగిందేమిటో వాళ్ల చేత చెప్పించేందుకు తాతలు దిగొచ్చారు!

* * *

ఇక ఇలాంటి పిల్లల్ని ఏమి చేయడం? బెత్తంతో వాళ్ల చీరడమా? జైల్లో పెట్టడమా? కాళ్ల గొలుసులతో కట్టేసి, చేతులకి అరదండాలేసి బండలు పగుల గొట్టించడమా? ఈ శిక్షలేవీ వెయ్యలేదు తల్లి. ఆమె చెప్పిన శిక్షంతా — పొయ్యిగూటినుండి కిందకి దిగమని, ముక్కు చీదుకుని, కళ్ల తుడుచుకుని, ముఖం కడుక్కోమంది, అంతే! ఇక అప్పుడడిగింది ఆమె. ఏమిటి చేయడమో సలహా చెప్పమని కావలిజవాన్ని.

భూగర్భశాస్త్ర పరిశోధక బృందంవారు అత్యవసర కార్యంపై అల్ కరాష్ లోవకు వెళ్లారనీ, వారు అక్కడనుండి తిరిగి వచ్చేసరికి అధమం పదిరోజులు పడుతుందనీ చెప్పాడు కావలిజవాను.

''అయితే, ఈ పదిరోజులూ ఎలా గడపడం? మాదగ్గరేమీ వంట సామాన్లు లేవే, ఎలాగు మరి?'' అని అడిగింది అమ్మ.

''ఎలాగేమిటి? అలాగే! ఎలాగో ఒకలాగు గడుపుకోండి మరి'' అన్నాడు కావలిజవాను. ''అక్కడున్న రొట్టె వాడుకోండి. పోతే, ఆ చెవులపిల్లి వుందిగా — చర్మం వొలిచి మాంసం వండుకు తినండి. వేటకు నేను పెట్టిన బోనులు చూసుకుందుకని రేపు నేను బయల్దేరి తైగాలోకి వెళ్తాను; వెళ్లి రెండ్రోజుల్లో వస్తాలెండి.''

''అబ్బే, అదేమిటయ్యా! ఇక్కడ మేం ఒక్కరం ఒంటరిగా వుండగలమా? అసలే మాకిది కొత్త స్థలమాయె. చూడబోతే చుట్టూ మహారణ్యమూ, వన్యమృగాలూనూ...'' అంది అమ్మ.

''బందూకొకటి మీకు ఇస్తున్నాగా. ఆ పాకలో వంటచెరకుంది. అదుగో, గుట్ట మలుపు తిరుగుతే, అక్కడే వుంది మంచినీటి ధార. ఈసంచీలో వుంది ముతక నూక. ఆ డబ్బాలో వుంది ఉప్పు. నాకిక పనుల్లేవా ఏమిటి? మీతో పెట్టుకుంటే నాకిక తెల్లవారినట్టే...'' అనేశాడు కావలిజవాను.

''అబ్బ ఏమి అసహ్యమైన మనిషి బాబూ! మన కడుపులో వున్న మాట అతగాడి ముఖంమీద కక్కేదునా?'' అని చుక్కు చెవిలో వూదాడు గెక్.

''నయం ఇంకా! ఆ పని మాత్రం చేయకు. చేస్తివా, ఈ పాళంగా మననీ ఇంట్లోంచి గెంటేస్తాడు. ఇక అప్పుడు మనం చేసేదేమిటి? నాన్న వచ్చే వరకూ ఓపికపట్టి వూరుకుందాం. నాన్న వస్తాడు కదూ, అప్పుడు నాన్నతో ఇతగాడి గురించి చెప్పేద్దాం'' అని సలహా చెప్పాడు చుక్.

''నాన్న వచ్చే వరకూనా? అబ్బో, నాన్న వచ్చేవరకూ ఎన్ని రోజులే అవునో ఎన్ని నెలలే అవునో?'' అన్నాడు గెక్.

అలా అని గెక్ తల్లి వొళ్లోకెక్కి కూచుని, కనుబొమలు ముడిపెట్టి, మాట మంచిలేని ఆ మొరటు కావలిజవానుకేసి కళ్లెర్రజేసి చూశాడు.

కావలిజవాను తాను తొడుక్కున్న పొట్టి బొచ్చుకోటును తీసేసి, లాంతరు వున్న బల్లదగ్గరకొచ్చాడు.

ఆ కోటు భుజం దగ్గరనుండి ఏకంగా పటకా వరకూ చిరిగిపోయి, చిరుగు వున్న చోట తోలు అంతా వేలాడుతూండడం అప్పుడు చూశాడు గెక్, అంత వరకూ చూడనేలేదు.

''పొయ్యిగూటిలో వున్న గిన్నెలో కేబేజీ పులుసు వుంది. అలమారా మీద చెమ్చాలూ, గిన్నెలూ వున్నాయి. బల్ల దగ్గర కూచుని మీరు వడ్డించుకుని భోజనం చెయ్యండి. ఈలోపున నేను నా కోటుకు మాసికేసుకుంటాను'' అన్నాడు కావలిజవాను.

''అబ్బే, అదేమిటి, అది మర్యాదా కాదే! ఈ ఇంటికి యజమానివి నువ్వు. నువ్వే వస్తువులన్నీ బల్లమీద అమర్చాలి. అతిథిసత్కారం చెయ్యాల్సింది నువ్వు. ఆ గొర్రెబొచ్చు కోటు నాకియ్యి — నీ కంటె నేనే బాగా మాసిక వెయ్యగల్గుతాను'' అంది అమ్మ.

కావలిజవాను అమ్మకేసి చూశాడు. గెక్కు కోరచూపులు అతడు కనిపెట్టాడు.

''ఓహో! భల్లూకప్పట్టును మించిపోయిందే మీ పట్టుదలెక్కడో! మిమ్మల్ని చూస్తేనే తెలుస్తోంది!'' అని సణుక్కుంటూ, కావలిజవాను లేచి, తన కోటును అమ్మకి అందిచ్చి, గిన్నెలు తీసుకొచ్చేందుకని అల్మారా దగ్గరకెళ్లాడు.

''ఏమయ్యా, కోటంతా ఆలా ఎందుకు చిరిగిపోయిందయ్యా?'' అని చుక్ చిరుగుకేసి చూపించి అతనిని అడిగాడు.



"ఎలుగ్గొడ్డుతో చిన్న పేచీ వచ్చింది. అదేమో ఓ రక్కు రక్కింది" అంటూ, ఒక పెద్ద గిన్నెతో కేబేజీ పులుసును బల్లమీద వుంచి, ముక్తసరుగా జబాబు చెప్పాడు కావలిజవాను, ఆ విషయం గురించి అట్టే చెప్పడం ఇష్టంలేక.

"విన్నావురా, గెక్? ఎలుగ్గొడ్డుతో చెయ్యీచెయ్యీ చేసుకుని పోట్లాడాట్ట అతడు! బహుశ అందు చేతే అతడంత కోపంగా వున్నాడ్రా ఈవేళ" అని ఉత్సాహంగా కేకేశాడు చుక్, కావలిజవాను గది లోంచి బయటికి వెళ్లగానే.

ఆ మాటలు గెక్ వినకపోవడమేమి, విన్నాడు. కాని ఎవరైనా సరే, ఒంటి చేత్తో ఎలుగ్గొడ్డును చంపిన వీరుడైనా సరే, అమ్మని పల్లెత్తు మాటంటే మాత్రం అతగాడు గెక్ ఆగ్రహాన్ని ఎదుర్కో వాల్సిందే!

* * *

మరునాడు పెందలాడే కావలిజవాను తన సంచి వీపున కట్టుకుని, తుపాకి బుజాన వేలేసుకుని, స్కీలు కాళ్లకు తగిలించుకుని, కుక్కను వెంటబెట్టుకుని తైగాలోకి వెళ్లిపోయాడు. ఇక వీరేమో, వారి పాట్లు వారు పడాల్సిందే.

ముగ్గురూ కలిసి నీళ్లకోసం బయల్దేరారు. గట్టు అవతల వైపుననున్న గండశిల అంచునుండి ఒక చిన్న చెలమ కిందనున్న మంచులోకి ధారాపాతగా పడుతూంది. మరుగుతూన్న టీకెటిల్ కొమ్ము నుండి వస్తూన్న దట్టమైన ఆవిరి పొగలా, ఈ చిన్న జలపాతం నుండి వొత్తుగా పొగర్లొస్తున్నాయి. కాని తీరా చుక్ తన వేలుపెట్టి చూసే సరికి మంచులా చల్లగా వున్నాయోమో ఆ నీళ్లు, వేలు జివ్వు మని కొరడుబారిపోయింది.

ఆ తరువాత పాకలోనుండి పుల్లలు మోసుకొచ్చారు. బ్రహ్మాండంగా వున్న ఆ పొయ్యను రాజ బెట్టడ మెలాగో అమ్మకి తెలిసిందికాదు. పుల్లలు ఒకంతట అంటుకున్నాయికావు. కాని తీరా అంటుకుని మండేటప్పటికల్లా గది అంతా ఎంత వెచ్చగా అయిపోయిందంటే, కిటికీ అద్దాలకు అవతలివైపు వొత్తుగా గడ్డకట్టుకుపోయిన మంచు అంతా ఇట్టే కరిగిపోయింది. కిటికీ అద్దాల్లోనుండి కనబడుతూంది అడవి పొలిమేరా, ఈ చెట్టుకొమ్మనుండి ఆ చెట్టుకొమ్మనుండి ఎగురుతూన్న గోరింకలూ, శ్యామల పర్వతాల శిఖరాలూ. ఇప్పుడవి చక్కగా కనబడుతున్నాయి.

ఈకలుతీసి కోడిని సిద్ధం చేయడమెలాగో అమ్మకి బాగా తెలుసు. కాని, చెవులపిల్లిని చర్మం వొలిచి సిద్ధం చేయడం ఎలాగో అమ్మకి అసలు తెలీదు. అమ్మ ఆ చెవులపిల్లి చర్మం వొలిచి సిద్ధం చేసే లోపున, మరెవరైనా అయితే ఆడుతూ పాడుతూ అవలీలగా ఏ అడవిపందినో ఎనుపోతునో చర్మం వొలిచి శుభ్రంచేసి సిద్ధం చేసేసుందురు అన్నమాట — అంతసేపు పట్టింది అమ్మకి!

ఈ చర్మం వొలుపు గెక్కుకి రోత అనిపించింది. చుక్ మాత్రం సరదాగా తల్లికి సాయం చేశాడు. అందుకు బహుమానంగా తల్లి చుక్కుకి చెవులపిల్లి తోక ఇచ్చింది ఆడుకుందుకు. తోకనిండా బొచ్చు వుండి అది ఎంత తేలికగా వుందంటే, పొయ్యిగూటి మీదకెక్కి, అక్కడనుండి దానిని గాలిలోకి ఎగర వేస్తే, గాలిగుమ్మటంలా గమ్మత్తుగా తేలిపోయింది.

మధ్యాహ్నం భోజనమయాక, ముగ్గురూ షికారు బయలుదేరారు.

తుపాకిని పట్టుకొని రమ్మనమనీ, పోనీ తుపాకిని తీసుకురావడానికి ఇష్టం లేకపోతే, అధమం తోటాలైనా కొన్నిటిని పట్టుకురమ్మనమనీ అమ్మని మహా బలవంతపెట్టాడు చుక్. ససేమిరా అమ్మ ఒప్పుకోలేదు.

తుపాకిని తీసుకురావడం పోయి, అందుకు బదులు ముక్కాలిపీటపై నిలబడి అమ్మ దానిని అన్నిటి కంటె ఎత్తుగా వున్న కొక్కేనికి తగిలించేసింది. తోటాలను అలమారా పైఅరమీద వుంచేసి, "తోటాలమీద వేలువేశావంటే జాగ్రత్త, ఇక నీకూ నాకూ మాటలు సరి, తెలుసునా?" అని చుక్కుతో గట్టిగా చెప్పింది.

చుక్కు ముఖం ఎర్రగా అయిపోయింది. అక్కడనుండి చడీచప్పుడూ లేకుండా మెల్లగా జారు కున్నాడు. అప్పుడే ఇదివరకే ఒక తోటాను జేబులో దాచేసుకున్నాడు చుక్.

ఆ షికారు నిజంగా అద్భుతమైన షికారే! ఆ ఇరుకు బాటలో మంచినీళ్ల చెలమకి బుజబుజ రేకులు బుజ్జారేకులు ఆడుకుంటూన్నట్టుగా ఒకరి వెంట ఒకరు నడుచుకుంటూ వెళ్లారు. ఆకాశం గాఢమైన నీలిరంగుతో ప్రకాశిస్తూంది. కత్తుల్లా వున్న శ్యామల పర్వత శిలలు ఆకాశంలోకి పొడుచు కొస్తూ, కలల్లో కనబడే దుర్గాల్లాగు, కోటబురుజుల్లాగు కానొచ్చాయి. జిజ్ఞాసువులైన గోరింకలు తమ కలకలారావంతో హిమవాతావరణ ప్రశాంతతను పటాపంచలు చేస్తున్నాయి. నిలుచున్నచోట కాలు నిలవకుండా చురుగ్గా తిరుగుతూన్న బూడిదరంగు ఉడుతలు గుబురుగావున్న దేవదారు కొమ్మలలో నుండి చెంగుచెంగుమని కుప్పిగంతులేస్తున్నాయి. చిత్రమైన మృగాలూ అద్భుతమైన పక్షులూ తమ అడుగు జాడలతో చెట్లకిందనున్న మెత్తని తెల్లటి తివాచీపై తమాషాగా జిలుగులు చిత్రించాయి.

హఠాత్తుగా తైగాలోనుండి దుభీమని చప్పుడు వినబడింది. ఏ మహావృక్షపు ఉన్నత శాఖల మీద పోగుపడిన మంచురాశో జారిపోయి గలగలమంటూ కిందకి పడిపోయుంటుంది.

అంతకు ముందు మాస్కోలో వున్నప్పుడు, ఈ మహాప్రపంచమంటే మాస్కో పట్నమూ, మాస్కో పట్నపు వీధులూ, ఇళ్లూ, ట్రాములూ, బస్సులూ అనుకునేవాడు గెక్.

ఇప్పుడేమిటో ఈ మహాప్రపంచం అంధకారబంధురమూ దుర్భేద్యమూ అయినట్టి బ్రహ్మాండమైన మహారణ్యమే కాబోలు ననిపించింది గెక్కుకి.

గెక్ స్వభావమే అంత. చక్కగా ఎండకాస్తూ సూర్యుడు ప్రకాశిస్తూన్నంత సేపూ, తన చుట్టూ వున్న ప్రపంచంలో కారుమబ్బులంటూనూ, కుండపోత వర్షాలంటూనూ లేకుండా ఇక ఎల్ల కాలం హాయిగా వుంటుందనుకుంటాడు.

తాను ఉల్లాసంగా ఉత్సాహంగా వుంటే, ప్రపంచంలో వున్న కడమ అందరూ కూడా ఉల్లాసంగానూ ఉత్సాహంగానూ వుండి తీరాలి అనుకుంటాడు గెక్.

* * *

రెండు రోజులు గడిచాయి. మూడో రోజు వచ్చింది, అయినా కావలిజవాను అతీ గతీ లేదు. మంచు కుప్పలు మధ్యనున్న ఆ చిన్న గుడిసెలో వ్యాకుల వాతావరణం వ్యాపించజొచ్చింది.

సంజవేళప్పుడూ, రాత్రిపూటా వారికి మరీ భయం వేసిపోయేది. వసారా తలుపు, గదితలుపు మూసేసి అడ్డగడియదించి, తాళం వేసేసేవారు. కిటికీల్లోంచి దీపంవెల్తురు బయటకు కనబడితే ఆ వెల్తురు చూసి దుష్టజంతువులు ఎక్కడొచ్చి పడతాయోనని, బయటికెక్కడా వెల్తురు చొరకుండా కిటికీలకు చాపలుకట్టేసేవారు. జంతువులు మనుషుల్లాంటివి కావనీ, జంతువులకు వెల్తురంటే భయమనీ, పాపం వాళ్లకి తెలిసిందికాదు. ఇంటికున్న పొగగొట్టంలోనుండి గాలి హోరుమని మోతపెట్టేది. ఇక బయట మంచుతుపాను వీస్తూంటే, ఆ జోరుకి మంచు తునుకలు గోడలమీదా, కిటికీ అద్దాలమీదా పడినప్పుడు, బయటనుండి ఎవరో తలుపుకొడుతూన్నట్టే, తలుపుమీద గోకుతూన్నట్టే వినబడేది.



పొయ్యిగూటల్లోకి ఎక్కిపోయి పడుకునేవారు. అప్పుడు వాళ్లకి తల్లి రకరకాల కథలూ గాథలూ ఎన్నో చెప్పేది. అలా చెబుతూనే ఆమెకి నిద్రపట్టిపోయేది.

''ఒరేయ్ చుక్కూ! ఐంద్రజాల మహేంద్రజాలికులు ఒక్క గంధర్వగాథల్లోనే వుంటారేమిరా? ఐంద్రజాల మహేంద్రజాలికులు నిజంగానే వుంటే ఎంతో గమ్మత్తుగా వుంటుంది! ఏం?'' అని అడిగాడు గెక్.

''మంత్రకత్తెలూ, దయ్యాలూ వుంటేనో?'' అన్నాడు చుక్.

''అబ్బ, వొద్దురా!'' అన్నాడు గెక్ చికాకుగా. ''అయినా, ఇంతకీ దయ్యా లెవడిక్కావాల? వెధవ దయ్యాలు పోనిద్దూ. కాని, ఒరేయ్! ఇప్పుడు నిజంగా మనం ఒక ఐంద్రజాలికుడిని మన ఎదుటకి రమ్మనమని పిలువగల్గితే ఎంత బాగుండును? ఓ, ఐంద్రజాలికుడా, నువ్వు ఎగిరివెళ్లి, మా నాన్న వున్న చోట వాలి, మేం ఏనాడో ఇక్కడికి వచ్చానమని చెబుదూ, అని అతడిచేత నాన్నకి కబురు పంపించి వుందుం. ఏం?''

''కాని వాడెలా ఎగిరి వెళ్తాడ్రా?''

''ఎలా ఎగిరి వెళ్తాడా? చేతులు వూపుకొంటాడు, రెక్కలు కట్టుకుంటాడు, ఏదోచేస్తాడు. అదేదో వాడే చూసుకుంటాడులే.''



''ఇలా చలికి కొరడుబారి పోతూంటే, వాడి మొహం, వాడేం చేతులు వూపు కోగల్గుతాడ్రా? నేనేమో గ్లౌవ్స్‌వేసుకుని, వాటిమీద సంచీగ్లౌవ్స్ తొడుకున్నానాయె. అయినా పుల్లలు తెస్తూన్నప్పుడు నావేళ్లు కొయ్యబారిపోయాయి'' అన్నాడు చుక్.

''అవున్లే. కాని నిజంగా చెప్పరా, గమ్మత్తుగా వుంటుందా, వుండదా?''

''ఏమోన్రా, నాకు తెలీదు'' అంటూ, చుక్ తటపటాయించుతూ జబాబిచ్చాడు. ''నీకు జ్ఞాపకం వుందా, మన ఇంటి దొడ్డిలో వున్న నేలమాళిగలో ఇప్పుడు మిష్క క్రూకొవ్ వుంటున్నాడే, అక్కడ మునుపు వుండేవాడు, ఆ పొట్టవాడు? కరకజ్జం అమ్మేవాడు, ఏం? ఆండంగులూ ముసలమ్మలూ అందరూ అతడి దగ్గరకొచ్చి సోదె చెప్పించుకునేవారు.''

''అయితే, ఒరే, అతడు చెప్పినట్టే జరిగేదిరా?''

''ఆ సంగతి నాకు తెలీదు సుమా. కాని మిలీషియావాళ్లు మాత్రం వచ్చి ఆ మనిషిని అరెస్టు చేసి తీసుకుపోయారు. అతడున్న గది సోదా చేసే సరికి, చోరీ వస్తువులెన్నో ఆగదిలో దొరికాయి.''

''చూశావా! వాడు ఐంద్రజాలికుడూ కాదు, మహేంద్రజాలికుడూ కాదు, వాడొట్టి దొంగ. ఏం, అంతేకదూ?''

''కాకపోతే మరేమిటి — వొట్టి దొంగే!'' అన్నాడు చుక్. ''నన్నడుగుతే — ఐంద్రజాలికులూ, మహేంద్రజాలికులూ అందరూ వొట్టి దొంగలేన్రా! తేరగా కూచుని మనుషుల్ని నమ్మించి మభ్యపెట్టి తనకి కావాల్సిన వస్తువులనన్నిటినీ కాజేస్తూంటే, అటువంటి వాడు వొళ్లొంచి ఎందుకు పనిచేస్తాడేమిటి?

...అవునుగాని, నేనిక నీకేమీ కబుర్లు చెప్పను. ఇప్పటికే ఎంతో ఆలస్యమైపోయింది. నువ్విక నిద్రపోరా, గెక్!'' అన్నాడు చుక్.

''ఏంకదా?''

''ఏంకదా ఏమిటి? నువ్వుత్త పిచ్చివాగుడు వాగుతున్నావని. ఇలా ఇప్పుడు వాగుతావు, ఇక నిద్రలో నీకేవో పాడుకలలొచ్చి, మోకాళ్లతోనూ మోచేతులతోనూ నన్నూరికే కుమ్మి చంపుతావు. నిన్న రాత్రి నన్నలా పొట్టలో పొడిచేవుకదా, నీకు గమ్మత్తుగానే వుందేమో! నీ పొట్టలో పొడిచి చూపిస్తా కావాలంటే. ఇక పడుకో'' అని కోప్పడ్డాడు చుక్.

* * *

నాల్గోరోజు ఉదయం వంట చెరకు కోసమని అమ్మే స్వయంగా గొడ్డలితోమొద్దులు నరకాల్సొచ్చింది. చెవులపిల్లిని ఏనాడో వండుకు తినేశారు. ఆ ఎముకలకు అంటుకునున్న మాంసపు పిసళ్లను గోరింకలు అప్పుడే సాపుగా పొడుచుకు తినేశాయి. ఆనాడు మధ్యాహ్నం భోజనానికి, వొట్టి అంబలీ, ఉల్లిపాయలూ, చేతిమీదకి నూనే, అంతే. దానితోనే కాలక్షేపంచేశారు. రొట్టె కూడా నిండుకుంటూంది. కాని కాస్త గోధుమపిండి ఆ ఇంట్లో అమ్మకెక్కడో కనబడితే, దానితో పిల్లలకి నాలుగు బిస్కట్లు చేసిపెట్టింది.

భోజనం చేసిన తరువాత గెక్కుకి వంట్లో మెతకగా వున్నట్టనిపించింది. కుర్రాడికి జ్వరం తగిలిందేమిటి చెప్మా అనుకుంది తల్లి.

ఎక్కడికీ కదలొద్దు, ఇంట్లోనే వుండిపోవాలి సుమా, అని పదిమాట్లు గెక్కుకి బుద్ధులు చెప్పి, తల్లి చుక్కుకి దుస్తులు తొడిగి, చిన్న లాగుడుస్లెయ్‌బండి ఒకటి అక్కడుంటే, దానిమీద బాల్చీలు వుంచి నీళ్ల తెచ్చుకుందుకూ, మర్నాడు ఉదయం పొయ్యిరాజబెట్టేందుకు చిదుగులు ఏరి ఆస్లెయ్‌మీద పడేసి తెచ్చుకుందుకూ ఇద్దరూ బయల్దేరారు.

గెక్ ఒక్కడూ ఇంట్లో ఉండిపోయాడు. అమ్మా అన్నా ఎప్పుడొస్తారో అని చాలాసేపు కనిపెట్టుకుని అలా కూచున్నాడు. కూచుని కూచుని ఇక గెక్కుకి చికాకెత్తిపోయి, ఏమి చెయ్యడమా అని ఆలోచించగా, ఆలోచించగా, కొత్త ఆలోచన ఒకటి తట్టింది.

* * *

తల్లీ చుక్కూ వెళ్లి చాలా సేపే అయింది. రెండు బాల్చీలూ మంచినీళ్లతో నింపుకొని, బాల్చీలనూ, ఏరి పోగుచేసిన కట్టె పుల్లలనూ స్లెయ్‌మీద వుంచి, స్లెయ్‌ని ఇంటికి ఈడ్చుకొస్తూండగా, దారిలో స్లెయ్ తిరగబడింది, మంచినీళ్లన్నీ వొలికిపోయాయి. అయ్యో అనుకుని, మళ్లీ చెలమ దగ్గరకి వెళ్లి నీళ్లు తెచ్చుకున్నారు. సగం దారిలో తీరా చూసుకునే సరికి, చుక్ తన సంచీగ్లొవ్ ఒకదానిని అడవి



పొలిమేరదగ్గర వదలిపెట్టేసి చక్కావచ్చేసినట్టు జ్ఞాపకంవచ్చింది. అది తెచ్చుకోడానికని 'మళ్లీ వెనక్కి వెళ్లారు. ఇంతట్లోకి చీకటి పడిపోయింది.

ఎలాగైతేనేమి ఇంటికొచ్చారు. ఇంటికొచ్చి చూసుకునే సరికి, గెక్ ఎక్కడా కనబడలేదు. పొయ్యి గూటి అరమీద గొర్రెబొచ్చు తోళ్ల మేట పడేసి వుంటే, ఆమేట కింద దాగున్నాడేమో అనుకున్నారు. తీరా చూసేటప్పటికి అక్కడలేదు.

తనకు రహస్యం తెలిసిపోయిందన్నట్టుగా చుక్ తల్లికేసి కన్నుగీటి చిరునవ్వుతూ, పొయ్యి కిందకి దూరి అక్కడ దాగున్నాడు గెక్కు అని తల్లి చెవిలో రహస్యం చెప్పాడు.

తల్లికి గెక్కుమీద చెడ్డకోపం వచ్చింది. తక్షణమే పొయ్యికిందనుండి బయటికి రావల్సిందని గెక్కుని కఠినంగా ఆజ్ఞాపించింది. కాని ఉలకా లేదు, పలకా లేదు గెక్.

అప్పుడేమో పొయ్యినుండి నిప్పులు పైకితీసే పొడుగాటి చిమటా పుచ్చుకుని, దానితో పొయ్యి కింద కెలకడం మొదలెట్టాడు చుక్. అబ్బే, గెక్ అక్కడుంటే కద? అక్కడ లేనేలేదు గెక్.

దానితో తల్లికి నిజంగానే ఆందోళన పుట్టుకొచ్చింది. చిలక్కొయ్యకేసి చూసేసరికి అక్కడ గెక్కుకోటూ లేదు, టోపీలేదు.

బయటికి వెళ్లి ఇంటిచుట్టూ తిరిగొచ్చింది తల్లి. నాలుగు చెరగులా గాలించింది. ఎక్కడా కనబడలేదు. ఇంట్లోకొచ్చి లాంతరు వెలిగించింది. లాంతరు పట్టుకుని చీకటికోణంగా వున్న కొట్టు గది, పుల్లల పాక, రెండింటిలోనూ చూసింది...

గెక్కుని పేరుపెట్టి బిగ్గరగా పిలిచింది. కేకలేసి గట్టిగా చీవాట్లుపెట్టింది. నాయనా, బాబూ అని బతిమాలుకుంది. కాని ఎక్కడా బదులులేదు, ప్రత్యుత్తరంలేదు. ఇంతట్లో అంధకారం ఆవరించింది. తెల్లగా వున్న మంచుకుప్పల్ని సహితం కారు చీకటి పొట్టబెట్టుకుంది.

రివ్వున తల్లి ఇంట్లోకి పరుగెత్తి, కొక్కేనికి తగిలించిన తుపాకిని లంకించుకుని, తోటాలను సంగ్రహించి, లాంతరు పట్టుకుని, ఆరునూరయేది నూరు ఆరయేది ఇంట్లోనుంచి కదల కూడదు సుమా, ఖబడ్దార్ అని చుక్కుని ఆజ్ఞాపించి, బయటికి పరుగెత్తింది.

ఆ నాలుగు రోజుల్లోనూ లెక్కకు మించినన్ని అడుగు జాడలు మంచుమీద పడున్నాయి.

అందుచేత తాను ఎక్కడనుండి వెతకడం ఆరంభించాలో తల్లికేమీ పాలుపోలేదు. ఏమైతేనేమి గెక్ ఒక్కడూ ఒంటరిగా అడవిలోకి వెళ్ల సాహసించడని నిశ్చయించుకుని, రోడ్డుమీదకే వెళ్లింది.

రోడ్డుమీదెక్కడా మనిషి వాసనైనా లేదు.





తుపాకిని తోటాలతో బారుచేసి, ఆమె తుపాకిని పేల్చింది. ప్రత్యుత్తరం కోసం జాగ్రత్తగా వింది. చీమ చిటుక్కుమంటే వినబడే ఆ నిశ్శబ్దంలో ఏ అలికిడీ చెవినిబడలేదు. రెండోసారి తుపాకిని పేల్చింది, మళ్లీ మూడో సారి పేల్చింది.

తటాలున ఎక్కడనుండో దగ్గరగానే తన తుపాకి పేలుడుకి ప్రత్యుత్తరంగా గుండు చప్పుడు వినబడింది. హుటాహుటిని తనకు సహాయం చేసేందు ఎవరో వస్తున్నారు కదా అనుకుని ఆ దిశగా ఆమె పరుగెత్త బోయింది. కాని ఆమె ఫెల్ట్‌బూడ్సు మంచులో కూరుకుపోయి చేతిలో వున్న లాంతరు కింద పడి చీమ్నీ బద్దలై దీపం ఆరిపోయింది.

ఈలోపున ఆ నిశ్శబ్దాన్ని బద్దలుచేస్తూ చెవులు చిల్లులు పడేటట్టు గుడిసె ముందుగుమ్మంలో నుంచి ఖ్యాయ్‌మని చుక్కు కేక వినబడింది.

తుపాకిగుళ్ల చప్పుడు విని, అప్పుడే గెక్కుని తోడేళ్లు మింగేశాయనీ, ఇక అవి తల్లిమీద పడు తున్నాయనీ నిశ్చయం చేసుకుని, చుక్ గుండెలు విచ్చిపోయేటట్టు ఒక్క అరుపు అరిచాడు.

ఆ లాంతరు అక్కడ పారేసి, తల్లి రోజుకుంటూ రొప్పుకుంటూ ఇంట్లోకొచ్చింది. కోటు తొడు క్కోకుండానే గుమ్మంలోంచి బయటికి వెళ్లబోతూన్న చుక్కుని తల్లి ఇంట్లోకి తీసికుపోయి, తుపాకిని



ఒక మూల గిరవాటేసి, అక్కడున్న బాల్చీలో పెద్దగరిటెను ముంచి, మంచులా నాలిక పీకేస్తూన్న ఆ చల్లని మంచినీళ్లనే గడగడమని నాలుగు గుక్కలు ఆదరా బాదరా తాగేసింది.

గుమ్మం మెట్లమీద ఉరుములూ పిడుగులూ లాగ ఫెళఫెళ చప్పుడైంది. గుభీమని తలుపు తెరుచుకుంది. బాణంలా చొరబడింది కుక్క. కుక్కవెంటే, ఆవిరి పొగర్లు విరజిమ్ముతూ పెద్ద బొచ్చు కోటు వేసుకున్న కావలిజవానూ వచ్చాడు గుడిసెలోకి.

''ఏమిటీ రాద్ధాంత మంతా? దేనికీ గుళ్లు పేల్చడం?'' అని అడిగాడతడు కుశలమైనా అడగ కుండా, తన కోటూ టోపీనైనా తీయకుండానూ.

''చిన్నాడు కనబడ్డంలేదు'' అంది తల్లి కళ్లవెంట నీళ్లు బొటబొట కారుతూనూ. అంతే ఆ రెండు ముక్కలే, అంతకు మించి ఆమె నోటనుండి మరి మాటరాక వలవల ఏడ్చేసింది.

''ఇదిగో, ఆ ఏడుపు కట్టిపెట్టండి మొదట!'' అని చర్రుమన్నాడు కావలిజవాను. ''ఎప్పట్నుండి కనబడ్డం లేదు? చాలాసేపట్నుండా, ఇప్పుడేనా? నువ్వు వెనక్కివెళ్లు, స్మేలీ*!'' అని కుక్కని మంద లించి, ''జబాబు చెప్పండి, లేకపోతేనేనిక్కడ నుండి వెళ్లిపోతాను'' అని అతడు చిరాకుగా అన్నాడు.

* 'స్మేలీ' అంటే రష్యన్ భాషలో భయం ఎరగనిది అని అర్థం.

"గంటసైగా కనబడ్డం లేదు" అంది అమ్మ. "మంచినీళ్లకని పెద్దాడిని తీసుకుని వెళ్లాను. ఇంటి కొచ్చేసరికి చిన్నాడు లేడు. కోటేసుకుని టోపీపెట్టుకుని, మరి ఎక్కడికి వెళ్లిపోయాడో వెళ్లి పోయాడు" అని చెప్పింది అమ్మ.

"గంటసేపే అయితే ఎంతో దూరం వెళ్లివుండడు. ఫెల్ట్‌బూడ్సూ, కోటూ తొడుక్కుని టోపీపెట్టుకున్నాడు కాబట్టి చలికి కొరడుబారిపోయే ప్రమాదం లేదు. స్మేలీ, ఇలారా! ఇవి వాసన చూడు" అన్నాడు కావలిజవాను.

అలా అంటూ చిలక్కొయ్యనున్న గెక్కు బొచ్చుటోపీని అందుకుని ఆ టోపీనీ, గెక్కు రబ్బరు జోళ్లనీ కుక్కకి వాసన చూపించాడు.

కుక్క వాటిని జాగ్రత్తగా వాసన చూసి, సంగతంతా తనకి అర్థమైనట్టు తన యజమానికేసి చూసింది.

"కానీ ఇక చూస్తావేమిటి!" అంటూ కావలిజవాను గుమ్మం తలుపు తీసి, "వెళ్లు, స్మేలీ! వెతుకు!" అని కుక్కని ఆజ్ఞాపించాడు.

కుక్క తోక ఆడించిందే కాని, అక్కడనుండి మాత్రం కదిలిందికాదు.

"వెళ్లు, స్మేలీ! వెళ్లి వెదుకు!" అని అతడు కుక్కని గదమాయించాడు.

కుక్క వూరికే ఇటూ అటూ తలకాయ ఆడించి, కాళ్లతో నేల గోకిందే కాని, ఒక్క అడుగేనా ముందుకేసింది కాదు.

"ఏమిటీ వేషాలూ తందనాలూనూ?" అని కావలిజవాను కోపంగా కఠినంగా గద్దించాడు కుక్కని. మళ్లీ మరొకసారి టోపీనీ రబ్బరు జోళ్లనీ వాసన చూపించి, కుక్కని కాలరు పట్టుకుని తనతో కూడా కావలిజవాను దాన్ని బయటకి తీసుకెళ్లబోయాడు.

ఏమైనా సరే కుక్క యజమాని వెంట వెళ్లింది కాదు. కొసకి అది తానున్న చోటనే నాలుగు సార్లు గిరికెలు తిరిగి, చివరికి వీధిగుమ్మంకేసి కాకుండా, అందుకు ఎదురు దిశగా గదిలోనే ఒక మూలకెళ్లింది.

ఆ మూలకెళ్లి, అక్కడొక భోషాణం వుంటే, ఆ భోషాణం దగ్గర ఆగి, ఆ పెట్టె తలుపును తన పంజాతో బరబర గోకింది. గోకి, తన యజమానికేసి చూసి, బిగ్గరగానూ బొంగురుగానూ మూడు సార్లు మొరిగింది.

కుక్క మొరగ్గానే, ఆశ్చర్యపోతూన్న ఆ తల్లికి కావలిజవాను తన చేతనున్న తుపాకిని పట్టుకో మని ఇచ్చి, భోషాణం దగ్గరకెళ్లి తలుపు తెరిచాడు.

ఆ భోషాణంలో గోనెలూ, అలుగుడ్డలూ, గొర్రెబొచ్చు తోలుకోట్లూ కుప్పగా పడేసి వుంటే, ఆ కుప్పమీద, తన టోపీ తలకింద పెట్టుకుని తన మీద కోటు పడేసుకుని హాయిగా వొళ్లెరక్కుండా పడుకుని నిద్రపోతున్నాడు గెక్.



గెక్కుని పైకితీసి లేపేసరికల్లా, నిద్రకళ్లతో కళ్లు మిణకరించుతూ అందరికేసి చూశాడు. తన గురించి అందరూ ఎందుకంత గొప్పగా హడావుడీ అట్టహాసం చేస్తున్నారో గెక్కుకి ఏమీ అర్థం కాక విస్తుపోయాడు. అమ్మ గెక్కును ముద్దుపెట్టుకుంటూ ఆనందం భరించలేక వెక్కివెక్కి ఏడుస్తూంది. చుక్ అదేపనిగా తమ్ముడి కాళ్లూ చేతులూ నిమురుతూ గంతులేస్తూ:

''హుర్రా! హుర్రా!'' అని చప్పట్లు కొడుతున్నాడు.

తన సంతోషంలో చుక్ బొచ్చుకుక్క స్మేలీని ముఖంమీద ముద్దుపెట్టుకున్నాడు. కుక్కకి మాత్రం ఈ లాలన అదేదో కొత్తగా అనిపించి, దానికేమీ తోచక ముఖం తిప్పేసింది. ఈ హంగామా అంతా ఎందుకో దానికి కూడా ఏమీ అర్థమైంది కాదు. తన తోక మాత్రం నెమ్మదిగా ఆడించుకుంటూ, బల్లపైనున్న రొట్టెముక్కకేసి ఆశతో చూస్తూంది.

కొంతసేపయాక జరిగిన వృత్తాంతం చెప్పాడు గెక్. చుక్కుని తీసుకుని అమ్మ నీళ్లకోసం వెళ్లిన తరువాత, తాను ఒంటరిగా వుండడంవల్ల గెక్కుకేమీ తోచక, ఏదైనా గమ్మత్తు చేద్దామని బుద్ధిపుట్టింది. దాంతో చిలకొయ్యనుండి కోటూ టోపీ తీసి, ఆ భోషాణంలో ఎక్కి దానిలోకి దూరాడు. అమ్మ, చుక్కూ వచ్చేవరకూ అందులోనే పడుకుని వుందాం, తన కోసం వాళ్లు గాభరా పడుతూ ఇల్లంతా వెతుకుతూంటే, అప్పుడు ఆ మూతవేసి వున్న భోషాణంలోనుంచి తటాలున



''భౌ'' మని ఒక కేక పెడితే, అమ్మ చుక్కూ హడలిపోతారనీ, అది మంచి గమ్మత్తుగా వుంటుందనీ అనుకున్నాడు.

కాని వాళ్లు ఇంతకీ రాలేదు, అంతకీ రాలేదు. అయినా అలాగే ఓపికతో భోషాణంలోనే వుండిపోయాడు. ఇంతట్లో కునికిపాట్లు వచ్చి, నిద్రపట్టిపోయింది గెక్కుకి.

అదంతా వింటూన్న కావలిజవాను తటాలున లేచి, తన కోటు జేబులోనుండి నలిగిపోయున్న ఒక నీలిరంగు కవరు వుత్తరాన్నీ, ఒక పెద్ద తాళంచెవినీ తీసి టక్కుమని బల్లపైన వుంచి:

''ఇదిగో ఇవి మీకోసం'' అన్నాడు. ''ఇదేమో మా దళనాయకుడు సెరేగిన్ గదికీ, కొట్టు గదికీ తాళంచెవి. ఈ వుత్తరం కూడా ఆయన పంపించినదే. ఆయన ఆయనా బృందమూ ఇక నాల్గు రోజుల్లో, సరిగా సంవత్సరాదికి ముందు రోజునే వస్తారు'' అని చెప్పాడు.

ఓహో, ఇప్పుడు తెలిసింది, కస్సు బుస్సు మంటూ చిరచిరలాడుతూన్న ఈ ముసలాడు ఎక్కడికెళ్లాడో! తాను పెట్టిన బోన్లు చూసుకొస్తానన్నాడు గాని, అందుకు బదులు, ఎంతో అంత దూరమున్న ఆ అల్‌కరావ్ లోవకి స్కీ చేసుకుంటూ వెళ్లాడన్నమాట, పాపం!

ఆ వుత్తరం విప్పకుండా అలాగే వుంచేసి అమ్మ కృతజ్ఞతతో ఆ ముసలతని బుజంమీద చేయివేసింది.

ముసలాడు జబాబు చెప్పడం బదులు, ఆ భోషాణంలో తాను పదిలంగా వుంచుకున్న బఠాతు ముక్కల బుట్ట అంతా గెక్ కలగాపులగం చేసేశాడనీ, బంగారు లాంటి లాంతరు చిమ్నీని అమ్మ నిష్కారణంగా బద్దలు కొట్టేసిందనీ వూరికే గొణగడం ప్రారంభించాడు. అలా అతడు గొణుగుతూనే వున్నా ఈ వింత వృద్ధుడంటే వాళ్లందరికీ ఇక భయం పోయింది.

ఆ సాయంకాలమంతా గెక్కుని అమ్మ ఎక్కడకీ కదలనీయలేదు, తన కళ్లముందే ఆడుకోవాలంది. అమ్మ చెప్పినట్టే గెక్ ఎక్కడకీ వెళ్లకుండా ఇంట్లోనే ఆడుకుంటూన్నప్పటికీ, ఇంత పిసరు చప్పుడయేటప్పటికల్లా, గెక్ ఎక్కడ మాయమైపోతాడో అని భయపడిపోయి గబుక్కున వచ్చి వాడిని గుండెలకు హత్తుకునేది. ఇక అమ్మ గెక్కుని ఎంత ముద్దు చేసేసిందంటే, చుక్ మూతి ముడిచేసుకుని, తానే ఆ భోషాణంలోకి దూరి దాగునుంటే ఎంత బాగుండిపోనోకదా, అప్పుడు అమ్మ తనను కూడా ఇలాగు ముద్దు చేసి వుండునే, అయ్యో, ఆ సంగతి తనకెందుకు తట్టింది కాదు చెప్మా, అని పదేపదే తనలో తాను దుఃఖపడ్డాడు!

* * *

ఇక ఇప్పుడు మొదలైంది అసలు హడావుడీ గమ్మత్తూనూ. మరునాడు పొద్దున్నే కావలిజవాను తాళం తీసి నాన్న గది తెరిచాడు. తరువాత ఆ గదిలో వున్న పొయ్యిలో నిప్పేసి రాజబెట్టి కణకణమని మండేటట్టు చేశాడు. అదయాక వాళ్లు వూరినుండి తెచ్చుకున్న సామాన్లనన్నీ తీసుకొచ్చి ఆ గదిలో పెట్టాడు. గదేమో మంచి విశాలంగానూ బాగా వెల్లడిగానే వుంది కాని, నానా గందరగోళంగానూ గజిబిజిగానూ వుంది.

వెంటనే గది శుభ్రం చేయడం మొదలుపెట్టింది అమ్మ. గదంతా కడగనూ, బల్లకూర్చు నేలంతా సబ్బుతో బ్రష్షుపెట్టి తోమనూ, సామాన్లు సర్దనూ, ఆ వస్తువు తీసి ఇక్కడ పెట్టనూ, ఈ వస్తువు తీసి అక్కడ పెట్టనూ — ఆవేళల్లా అమ్మకి ఇదే పని.

కొసకి సాయంకాల మయేసరికి కావలిజవాను పొయ్యిగూటిలోకి పుల్లలు తీసుకొచ్చి గదిలో అడుగు పెట్టబోయే సరికి, నిగలాడుతూ అద్దంలా మెరసిపోతూన్న ఆ గది చూసి ఇక లోపల అడుగ పెట్టడానికి కాలురాక, గుమ్మంలోనే అలా నివ్వెరపోయి నిలబడిపోయాడు.

అతడలా ఆగిపోయాడే కాని, కుక్క స్మేలీ మాత్రం జంకూ గొంకూ లేకుండా గంతులేసుకుంటూ సరాసరి లోపలికొచ్చేసింది.

అప్పుడే శుభ్రంగా కడిగి పొడిగుడ్డతో తుడిచేసిన నేలమీద పరుగెత్తుకుంటూ గెక్కు దగ్గర కెళ్లి తన చల్లని ముక్కుతో గెక్కును మెల్లగా తట్టింది. "అరె, వెర్రినాగమ్మా! పసికట్టి నిన్ను కనిపెట్టింది నేను కాదట్రా? అందుకని నాకేమేనా పెట్టవా?" అంటూ అడుగుతూన్నట్టు గెక్కు కేసి చూసింది.



ఇదంతా కనిపెట్టి అమ్మ సాసేజిముక్క కోసి స్మేలీకి గిరవాటువేసింది.

అది చూసి, కావలిజవాను: "తైగాలో కుక్కలికి సాసేజిలు తినిపించి పెంచితే, ఇక గోరింకలు నవ్వలేక చస్తాయి" అంటూ మూలిగాడు.

అమ్మ ఆ మూలుగు విని సాసేజిలో సగం ముక్కకోసి అతనికిచ్చింది. అది పుచ్చుకుని, ధన్యవాదం చెప్పి, పట్నవాసపు మనుషుల తీరూ మోస్తరూ తనకేమీ అర్థం పర్థం కావడంలేదని తనలో తాను గొణుక్కుంటూ తల పంకించుతూ వెళ్లిపోయాడు.

* * *

సంవత్సరాది చెట్టును పెడదామని వాళ్లు ఆ మరునాడు నిశ్చయించుకున్నారు.

ఆ చెట్టు ముస్తాబులకోసమని ఇక వాళ్లు ఉపయోగించని వస్తువంటూలేదు, వాళ్లు పడిన శ్రమ ఇంతా అంతా కాదు.

తమ కంటబడిన పాత సచిత్రమాసపత్రికల్లో వున్న బొమ్మల నన్నిటినీ కత్తిరించి అట్టలకు అంటించారు. చేతికి దొరికిన గుడ్డపేలికలూ కంటబడ్డ దూది పిసళ్లూ పోగుచేసి, వాటితో మనిషి బొమ్మలూ



జంతువుల బొమ్మలూ కుట్టి తయారుచేశారు. నాన్న సిగరెట్టు గుండ వుంచుకునే పెట్టె కోసం వెతకి, దానిలో వున్న సిగరెట్టు కాగితంతో తమాషా తమాషా పువ్వులు చేశారు.

పొయ్యిగూడు కోసం పుల్లలు తీసుకొచ్చిన కావలిజవాను, అంత చీదర పడుతూ చిర్రు బుర్రు మనేవాడు కూడా వాళ్ళు చేస్తూన్నదంతా చూస్తూ, వాళ్ల తెలివితేటలనూ పనివానితనాన్నీ మెచ్చుకుంటూ అలా గుమ్మంలో నిలబడిపోయేవాడు. అలా నిలబడ్డవాడల్లా తన ఆశ్చర్యాన్ని ఇక పట్టలేక, ఆపాళంగా వెళ్లిపోయి, తన గుడిసెలో తాను జాగ్రత్తపెట్టి వుంచిన టీ పొట్లాల తగరపు రేకు కాగితాలు, తాను గొడారి పనిచేసుకోగా మిగిలిపోయిన పెద్ద మైనపు ముద్ద తీసుకొచ్చి వాళ్లకిచ్చాడు.

ఇంకేముంది! వీటితో వాళ్లిక కొండ అందుకున్నారు. బొమ్మల ఫ్యాక్టరీ అంతా ఒక్క చిటికెలో కొవ్వొత్తుల ఫ్యాక్టరీ కింద మారిపోయింది. కొవ్వొత్తులు ముద్దలు ముద్దలుగా, కొంచెం వంకరటొంకరగానే వున్నప్పటికీ, కాంతిలో మాత్రం పట్నం షాపుల్లో డబ్బిచ్చి కొన్న మేలురకం కొవ్వొత్తులకు అవి ఏమీ తీసిపోలేదు.

ఇక వున్న లోటంతా చెట్టు ఒక్కటే. కావలిజవాన్ని గొడ్డలి ఇమ్మని అడిగింది అమ్మ. అతడు జవాబేనా చెప్పకుండా, గుభాలున లేచి కాళ్లకు స్కీలు తగిలించుకుని అడవిలోకి వెళ్లిపోయాడు.

అరగంట తిరగక ముందే ఆతడు తిరిగివచ్చేశాడు.

మీారేమంటే అనండి. మున్తాబేమీా అంత అందంగా లేదనీ, గుడ్డతో చేసిన కుందేళ్లు పిల్లుల్లా కానవస్తున్నాయనీ, బొమ్మ పుత్తళికలు అన్నిటికీ అచ్చుపోసినట్టు ఒక్కలాగే పొడుగు ముక్కులూ మిడిగుడ్లూ దొప్పచెవులూ వున్నాయనీ, తగరపు రేకు కాగితం చుట్టిన దేవదారు కాయలు షాపుల్లో దొరికే పాదరసపు బుడ్లల్లా తళతళకుమని మెరవడం లేదనీ — ఇంకా మరేమేనా మరేమేనా అంటే అనండి గాక. కాని ఒక్కటి మాత్రం ఖాయం — ఆ దేవదారు చెట్టులాంటిది మాస్కో మహాపట్నం అంతా గాలించినా మీాకు దొరకదు! ఆహాహా, ఏమి చెట్టు! తైగా సౌందర్యం అంతా ఆ చెట్టులో తొణికిసలాడుతూంది — సన్నంగా, పొడుగ్గా, నిటారుగా, ఠీవిగా నిలబడి, గుబురు కొమ్మల చివరనున్న లేత చిగుళ్లు పచ్చని నక్షత్రాల్లా ప్రకాశిస్తున్నాయి!

* * *

నాలుగు రోజులూ అనుకోకుండా ఇట్టే గడచిపోయాయి. కొసకి పాత సంవత్సరం కడపటి దినం వచ్చింది. ఇక తెల్లవారిందో లేనేలేదో, చుక్కూ గెక్కూ ఇక ఇంట్లో వుంటే కద! వాళ్లను పట్టుకుని ఇంట్లో వుంచడం బ్రహ్మ రుద్రాదుల తరమైంది కాదు. చలికి ముఖం నల్లబడిపోయిందే కాని, వాళ్లు మాత్రం అడవిలో అలా తిరుగుతూనే వున్నారు, ఏ క్షణం వాళ్ల నాన్నా, వాళ్ల నాన్న బృందమూ అవుపడతారో అని అలా పడిగాపులు కాస్తూనూ. నీళ్లగాబు కాస్తూన్న కావలిజవాను చెబుతూనే వున్నాడు —



ఎందుకలా మంచులో వొంటిని కరుదు బారించుకుంటారు, ఏమైనా సరే, మధ్యాహ్నం భోజనం వేళకిగాని వాళ్లు రారు సుమండీ అని.

నిజంగా అతడన్నట్టే అయింది కూడా. వాళ్లు భోజనానికని బల్ల ముందు కూచున్నారు, కావలి జవాను కిటికీ తట్టాడు. ఆపాళంగా ముగ్గురూ లేచిపోయి, ఆదరా బాదరా కోట్లు మీాదపడేసుకుని, పరుగో — వసారాలోకి పరుగెత్తారు!

''ఇక ఇప్పుడు జాగ్రత్తగా చూస్తూండండి'' అని చెప్పాడు కావలిజవాను. ''ఆ కనబడుతూన్న కొండ శిఖరం కుడి పక్కనుండి దిగుడు ఒకటి వుందిగా, ఇక కొద్ది క్షణాల్లో వాళ్లు ఆ దిగుడు మీాద కనబడతారు. తరువాత వాళ్లు తైగాలోకి దిగిపోయి మరి కనబడరు. ఆ నిముషంనుండి సరిగ్గా అరగంటకి వాళ్లు ఇంటిగుమ్మంలో ప్రత్యక్షం!'' అన్నాడు.

అతడు చెప్పినట్టే జరిగింది. కొండ కనుమలోనుండి వస్తూన్న బృందంలో మొట్టమొదట వాళ్లకి కనబడినది సామాన్ల స్లెయ్‌లను లాగుతూన్న కుక్కలమంద. ఆ స్లెయ్‌లవెంటే వస్తున్నారు రైంయ్ రైంయ్ మని స్కీచేసుకుంటూ కొందరు మనుషులు.

ఆ మహాపర్వతాల ముందు చిన్న నలుసుల్లా కానొచ్చారు ఆ వస్తూన్నవారు. అయినప్పటికీ తెల్లటి మంచులో వారి కాళ్లూ, చేతులూ, శిరస్సులూ ఉలితో చెక్కిన విగ్రహాల్లా స్పష్టంగా కనబడు తూనే వున్నాయి.

చెట్టూ చేమాలేని ఆ దిగుడులోనుంచి శరవేగంతో వారు స్కీచేసుకొస్తూంటే, గాలిలో ఈదు కుంటూ వస్తున్నట్టే కనబడింది. అలా వస్తూ వస్తూ తటాలున వారు అరణ్యంలో అదృశ్యమై పోయారు.

సరిగా అరగంట అయేటప్పటికల్లా కుక్కల మొరుగులూ, మనుషుల కేరింతలూ, కరకరమని మంచు శబ్దమూ, స్లెయ్‌బళ్ల కిర్రుకిర్రు చప్పుడూ దగ్గరగా వినబడ్డాయి.

ఇల్లు దగ్గర పడుతూందని పసికట్టేసి, ఆకలితో కడుపులు మాడుతూన్న ఆ కుక్కలు అడవి గుండా తుపాకిగుండులా దూసుకుపోయాయి. వాటి వెంటే వాటితో సమంగా వస్తున్నారు స్కీచేసు కుంటూ తొమ్మండుగురు మనుషులు.

అంత దూరంనుండే ఆ మనుషులు అమ్మనీ చుక్కనీ గెక్కనీ చూసేసరికల్లా చేతిలో వున్న స్కీకర్రలను గాలిలో వూపుతూ ''హుర్రా!'' అంటూ పెద్ద కేకపెట్టారు.

ఇక దాంతో గెక్ తన ఉత్సాహాన్ని ఆపుకోలేక, మెట్లమీాదనుంచి ఒక్క ఉరుకు ఉరికాడు. తన ఫెల్ట్‌బూడ్సు మంచులో కూరుకుపోతూన్నప్పటికీ, ఆ బృందంలో అందరికంటే ముందు వస్తూ, అందరికంటే బిగ్గరగా ''హుర్రా!'' అని కేకవేస్తూ అందరికంటే పొడుగ్గా వున్న గడ్డాల మనిషికేసి పరు గెత్తాడు గెక్!

* * *



ఆ మధ్యాహ్నమంతా ఆ వచ్చిన వారందరూ గడ్డాలు చేసుకుని స్నానాలు చేశారు.

సాయంకాలం మంచి సర్దాగా సంవత్సరాది పండుగ చేసుకుందుకు సంవత్సరాది చెట్టు చుట్టూ అందరూ సమావేశమయారు.

బల్లనిండా భక్ష్యాలు వుంచి, దీపాలు ఆర్పేసి, కొవ్వొత్తులు వెలిగించారు. కాని చుక్కా గెక్కా తప్ప కడమ వారందరూ పెద్దవాళ్లే అవడంచేత ఇక ఆ తరువాత ఏమి చెయ్యడమో వారికి తెలిసిందికాదు.

అదృష్టవశాత్తూ, వారిలో ఒకతడి దగ్గిర ఎకార్డియన్ వుంది. అతడా వాద్యాన్ని తీసుకొచ్చి, ఉత్సాహకరమైన నృత్యగీతం ఒకటి వాయించాడు. ఆ నృత్యగీతం చెవిని పడేటప్పటికల్లా అందరూ డాన్సు చేయడం మొదలెట్టారు. వారందరూ కూడా బాగా డాన్సు చేశారు — అందులోనూ ముఖ్యంగా అమ్మతో కలిసి డాన్సు చేసినప్పుడు మరీ బాగా డాన్సుచేశారు.

నాన్నకి డాన్సుచేయడం తెలీదు. ఆయన మంచి పొడగరి, కండలు తిగిన శరీరం. వెన్నలాంటి మనసు. ఆయన కాస్త గట్టిగా నడుస్తేనే చాలు, ఆ చెక్కకూర్పు నేల అదిరిపోయి, అల్మారాలో వున్న గాజుగిన్నెలన్నీ గణగణ చప్పుడయేవి. ఆయన నిజంగా డాన్సుచేస్తే ఇకనుందా!

చుక్కనీ గెక్కనీ ఆయన తన మోకాళ్లమీద కూచోపెట్టుకున్నాడు. డాన్సుచేస్తూన్న వారినందరినీ చూసి వాళ్లు ముగ్గురూ చప్పట్లుకొట్టారు.

కొంతసేపటికి డాన్సు ఆఖరైంది. గెక్కని ఒక పాట పాడమన్నారు.

పాడమని గెక్కని బలవంతపెట్ట నక్కర్లేదు, బతిమాల నక్కర్లేదు. వెంటనే పాడతాడు. చక్కగా పాడతాడు. పాడగలననే సగర్వంతో శ్రావ్యంగా పాడతాడు.

గెక్ పాటకు ఎకార్డియన్ వాద్యగాడు పక్కపాట వాయించాడు. ఆ రోజు గెక్ ఏ పాట పాడాడో నాకిప్పుడు జ్ఞాపకం లేదుగాని, చక్కనిపాట మాత్రం అవును, ఎందుచేతనంటే పాట వింటూ అందరూ అతి నిశ్శబ్దంగా కూచున్నారు. గుక్క తిప్పకోడానికి గెక్ ఒక్క క్షణం ఆగే సరికి, ఆ నిశ్శబ్దంలో కొవ్వొత్తుల చిటపట, బయట గాలి మోత స్పష్టంగా వినబడ్డాయి.

గెక్ తన పాట పూర్తి చేయడంతోనే అందరూ చప్పట్లుకొట్టి హర్షధ్వానాలు చేశారు. గెక్కని చేతిలో పెట్టుకుని బంతిలా గాలిలోకి ఎగరేసి పట్టుకోబోయారు. ఇంతట్లో తల్లి చూసి, వాళ్ల ఆ ఉత్సాహంలో మీదకెగరేసే సరికి గెక్కకి సరంబీ ఎక్కడ తగులుతుందో అని ఆమె హడలిపోయి, చప్పన గెక్కని తన చేతుల్లోకి తీసుకుని కౌగలించేసుకుంది.

ఇంతట్లో నాన్న తన గడియారం తీసి వేళచూసుకుని: ''ఇక అందరం కూచుందాం. ముఖ్య విషయం ఇప్పుడు ప్రారంభం కాబోతూంది'' అని అంటూ రేడియో పెట్టాడు.

అందరూ నిశ్శబ్దంగా కూచుని ఆత్రంగా వింటున్నారు.

మొదట అంతా ప్రశాంతంగా వుంది. మరో క్షణానికల్లా చప్పుడు వినబడింది — మోటార్ల శబ్దమూ, బొంయ్ బొంయ్‌మని హారన్ల చప్పుడూనూ. తరువాత మరో నిమిషానికల్లా కీచుకీచు మన్నట్టు

బుస్సుమని బుసకొడుతూన్నట్టూ చప్పుడయింది. ఎంతో దూరాన టింగ్ లింగ్‌మని శ్రావ్యంగా గంటల చప్పుడు వినబడింది.

పెద్ద గంటలూ, చిన్నమువ్వలూ కలిసి పల్లవి గానం చేస్తూన్నట్టుగా వినవచ్చింది:

టిర్-లీల్-లీల్లీ-డాంగ్!

టిర్-లీల్-లీల్లీ-డాంగ్!

చుక్కూ గెక్కూ ఒకరికేసి ఒకరు చూసుకున్నారు. ఆ గంటలేమిటో వారికి తెలుసు. దూరాన నున్న మాస్కోలో స్పాస్కీ బురుజు అరుణతార కిందనున్న క్రెమ్లిన్ బంగారు గంటల బృందగీతిక అది.

ఆ ఘంటారావాన్ని, ఆ గంటల మధురగీతికను — నూతన సంవత్సర వైతాళికుల గీతాన్ని — నగరాల్లోనూ, పర్వతాల్లోనూ, స్తెప్ మైదానాల్లోనూ, టైగా ప్రాంతాల్లోనూ, నీలాంబుధి జలాల పైనా — ఈ క్షణమందే ప్రజలందరూ విన్నారు.

వీరందరితోపాటూ, సర్వసేనానినుండి ఉత్తరువులకోసం అప్రమత్తతో నిరీక్షిస్తున్న ఆ కవచ శకట దళం కమాండరు కూడా ఈ మధురగీతాన్ని విన్నాడు.

అందరూ లేచి నిలబడ్డారు. నూతన సంవత్సర శుభాకాంక్షలను అందరూ ఒకరికొకరు అందజేసుకున్నారు. శుభమస్తు అని అందరూ పరస్పరం కోరుకున్నారు.

శుభం అంటే ఒక్కరు ఒక్కొక్క విధంగా ఎవరికి తోచినట్టు వారు అర్థం చేసుకున్నారు. అయినప్పటికీ శుభం అంటే తామందరూ కలిసి న్యాయబుద్ధితో జీవించాలనీ, కష్టపడి పనిచేయాలనీ, సోవియట్ యూనియన్ అని వెలసే శోభాయమానమైన ఈ మహాభూమిని మనోవాక్కాయకర్మలా ప్రేమించి, శ్రేయశక్తులా కాపాడాలనీ మాత్రం వారందరూ అర్థంచేసుకున్నారు.

